శ్రీరస్తు

# బుద్ధచరిత్ర

## యక్షగానము

(బుఱ్ఱకథ)






:గ్రంథకర్త:

సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత

సంస్కృతాంధ్ర పండిత

మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము

విజయ దశమి.

ప్రథమ ముద్రణము,

వేయి ప్రతులు.

1972



*For Copies:*

**Bandla Subrahmanyam,**

**PANDIT,**

**VETAPALEM, Chirala Taluka.**

**( Prakasam Dt. )**

నా రచనల నాదరించి సాహిత్యసేవయందుల్లాసము గలిగించుచున్న ఆంధ్రలోకమునకు నా కృతజ్ఞత.

— గ్రంథకర్త.

రు 2-00

శ్రీ సరస్వతి ఆర్టు ప్రింటర్సు, వేటపాలెము.



సువర్ణఘంటాకంకణ, గండపెండేర, బిరుదాంకితులు,

బుర్రకథా పితామహ, యక్షగాన సమ్రాట్

## శ్రీ శ్రీ శ్రీ నాజరు గారి అభిప్రాయము

శ్రీ శ్రీ శ్రీ సువర్ణఘంటా కంకణ బిరుదాంకితులు, సంస్కృతాంధ్ర పండితులు, శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య మహాకవిగారికి శతాభివందనములు.

ఆర్యా!

తమరు పంపిన "బుద్ధ చరిత్ర- యక్షగానము" మన శిష్యుడు చిరంజీవి పేరిశెట్ల వేంకట సుబ్రహ్మణ్యము నాకందించినారు చదివితిని. మీ కవిత, మృదుమధుర గంభీరమై, అనర్గళముగ సాగినది. పాఠకుల కింతటి సరళశైలి అందించిన రచయితలీనాడు అరుదు. అట్టి కాలములో ఇట్టి కవితనల్లిన తమరు ప్రశంసనీయులు. ఈ కవిత మీ బిరుదుకు తగిన రీతిలోనున్నది. వీరరస ప్రధానము, ప్రబోధాత్మకమైన యక్షగానముగూడ మీ కలమునుండి వెలువడిన, సువర్ణమునకు పరిమళ మబ్బినట్లుండునని నా భావన. అందులకై తమరు ప్రయత్నింపగలరని నాయాశ. అట్లు వెల్వడిన రచన, ఒక దేశమునకే గాక, యావత్ప్రపంచ, కార్మిక, కర్షక, కూలి, నాలి, జనాళికి సైతముపయోగపడి శాశ్వతకీర్తి బొందగలదని నాయభిప్రాయము. ఫణితిలో ఖండితకోవంగా ప్రతిబింబించుచున్నది. (భాషలో, భావనలో క్రొత్తదనము చూడలేక పోతిని) మీరు పాటించినవన్నియు చాల న్యాయముగ నున్నవి. నేను తమరిని కోరునదేమన "యక్షగానమనగా- నాట్యము." నాట్యమనగా- "నాట్యం తన్నాటకే ప్యేకయోగ్యం పూర్వకథాయుతం" అని మీరెరుగనిది కాదు దీనిలో "ఇతి వృత్తం త్రైలోక్య సర్వభావాను కీర్తనం, నానాభావోపసంపన్నం, నానావ్యవస్థాంతరాత్మకం, లోకవృత్తాను సరణం నాట్యం"

నిన్న, నేడు, రేపటి, నీ, నా, భావ సంపదలతో మనతో నిండిన సమాజవ్యక్తుల అనగా- లోకుల అనగా- ప్రజల నిత్యజీవితాభి

వృద్ధిక్రమానుగతాల నెఱుకపఱచేదిగా ఉండాలని. మనప్రాచీనులు శాసించారనే పై శ్లోకమే ఋజువని తమలాంటి ప్రముఖులకు, పండితులకు వేరే చెప్పనవసరం లేదు కదా?

సాహిత్యమునకన్న సమాజదృష్టి నాకు మిన్న. కావున యక్షగానము దాని రూపము మీద నాకున్న, నేను తెలిసికొన్న ఈచిన్న భావన తమకెఱింగించినాను. నశాస్త్ర దృష్టి, సమాజ పరమైనది తప్పులున్న క్షమింప ప్రార్థన.

కళాభివందనములతో,
భవదీయుడు,
నాజర్.

కొరిటపాడు,
29-7-1972.

## విజ్ఞప్తి

ప్రపంచమున మొట్టమొదట నహింసా సిద్ధాంతమును మాఱుమ్రోగించిన మహాప్రవక్తయగు బుద్ధుని చరిత్రయిది- ఇది యీనాటి రచన కాదు దీని వయస్సు సుమారిరువది వత్సరములు. నాఁడిది నలుఁబది నిముసములలోఁ జెప్పఁదగినకథ. కావుటంజేసి రేడియో గాయకులగు జి. వేంకటశివయ్యగారు కథకులుగా విజయవాడ రేడియో కేంద్రమువారప్పుడ దీనిఁబ్రసార మొనర్చిరి.

అంతందనిసనక కాలక్రమమునఁ బెంచియింత చేసితి. నా యీరచన నత్యంత ప్రశాంత స్వాంతంబునఁజదివి యమూల్యాభిప్రాయ మొసంగిన యక్షగాన కళానిధి నాజరు గారికి నాహృదయపూర్వక నమస్సులు—

గేయరచనా సమయమునఁ దనకుఁదోఁచిన సలహాల నొసంగుచు నాకుఁదోడ్పడిన మత్ప్రియాంతేవాసియగు చిరంజీవి పేరిసెట్ల వేంకట సుబ్రహ్మణ్యమున కస్మచ్ఛుభాశీస్సులు.

గ్రంథకర్త.



ఆస్మత్పితృపాదులు

బండ్ల వేంకటసుబ్బయ్యగారు

— గ్రంథకర్త.

శ్రీరస్తు

# బుద్ధచరిత్ర

## యక్షగానము

(బుఱ్ఱకథ)

శ్రీతెన్నైన్నలరారు తేజునధరి శ్రీభృత్సుతారాధ్యుఁడై
జోలంబాడెడి మాయవీడి సుఖియై శుద్ధోదనానందుఁడై
మేలుంగూర్చు యశోధరుండయి వనిన్ మీనాంకబాణాహతిఁ
శిలమ్మొడని మారజన్నిజతపశ్శ్రీ మిమ్ము రక్షించుతన్.

## గణాధిప ప్రార్థనము

రాగము- హంసధ్వని- ఆదితాళము

ప్రమథాధిపా- బుధవిదితకృపా- ప్రమథాధిపా
ఫణిసూత్రధారీ- భక్తాఘహారీ
భక్తితో నినుఁగోర దేవనాదు
వాంఛలీయరార- వరసురమందార ॥ప్రమ॥
పార్వతీసుతా- సజ్జనావనవ్రత
సూరివరాద్యనుత- సుబ్రహ్మణ్యనుత ॥ప్రమ॥

## పార్వతీదేవి ప్రార్థన

సరస్వతి రాగము- చతురస్రజాతి- త్రిపుటతాళము

దయననుఁ బ్రోవవమ్మా భవానీ
శూలపాణి- రాణి- మృదువాణి- దాక్షాయణి ॥దయ॥
అతినిగూఢ జ్ఞానప్రదాయిని- హైమవతీ
తల్లీ నిరతభక్త కల్పవల్లీ
జయమిడవే వేడుకతో నాకిఁక
పరమగుణపావని- బండ్ల సుబ్రహ్మణ్యకవి రక్షణి ॥దయ॥

# ఈశ్వర ప్రార్థనము

బేగడ రాగము- చతురస్రజాతి త్రిపుటతాళము

వరధీర దయఁజూడరా- మహేశ్వరా
నన్గావఁదడవేలరా- దేవదేవ గౌరీ ॥వర॥
అఘములను హరియింపవా- ఆనందభావ
అతిప్రేమ నన్నేలవా- భక్తావన పావన
దరిలేని మాయామ- హాంధకారమునుండి
రక్షించువాఁడ వీవే- దేవ దివ్యప్రభావ
విజయానంద నిర్గుణవిలాస- విధిసురపూజిత చరణసారస
సదయా దుర్గాధిప విమలవిభవ-నమగనవ-స్తుతివినవ- శివ-అభవ ॥వర॥

# సరస్వతి ప్రార్థన

కం॥ వాణీ! హిరణ్యగర్భుని
రాణీ! రమణీయగాన రాజిత వీణా
పాణీ! మదయుత బంభర
వేణీ! నానాల్క నిందు వేడ్కన్ నిలుమా.

# విష్ణు ప్రార్థన

— రగడ —

శ్రీరమణీమణిచిత్తవిహారా - శ్రితజనమందారా
సారాచారా కౌస్తుభహారా - సజ్జననుత ధీరా
దానవ భంజన ధార్మికరంజన - దాసావనకృష్ణా
మాననీయగుణజాలా నిస్తుల - మదకరీంద్రపాలా
నీపదరాజీవంబులఁగొల్తుము - నిచ్చలు కడుభక్తి
పాపదూరులనుజేసి మాకునిడు - పావనమగుముక్తి

## ఆశీస్సు

— రగడ —

నిరతము సుబ్రహ్మణ్యుని బ్రోచుచు - నిండు మహిమ వెలుఁగు
కరుణాకరుఁడయి భక్తవర్యులను - గాచుచుఁదాఁజెలఁగు
వాసిన్ రావూరిపేటపురంబున - వరలుచుండు శివుఁడు
కాశీవిశ్వేశుండీప్రజలను - గాచుఁగాత భవుఁడు

## భరతమాత

సీ॥ ఈశ్వర దత్తమౌ హిమగిరి ముత్యాల
డంబుమీఱిన కిరీటంబనంగ
వివిధ ధాతు విభూతి విలసిల్లు వింధ్యాద్రి
రాజరత్నాల యొడ్డాణమనఁగఁ
ప్రాక్పశ్చిమాబ్ధులఁ బ్రభవించు కెరటాలు
రహివీచు వింజామరంబు లనఁగ
సింహళద్వీపము సింహాసనము చెంత
ప్రియముగొల్పెడి పాదపీఠమనఁగ

తే॥ సకల దివ్యర్షిబృందము సంతసమున
మహిమ నుతియింపఁగల వందిమాగధులన
నెగడు నిర్మలవిఖ్యాత నిత్యపూత
పరమగుణగణసముపేత భరతమాత.

## సంస్కృత కవుల స్తుతి

ఆ॥ వె॥ పరమ భక్తిఁగొలుతుఁ - బ్రాచేతసుని వ్యాసు
భాసు దండి కాళి-దాసు భోజు
బాణు హర్షు మాఘు - భవభూతి భారవి
దేవవాణి రసనఁ - దేజరిలఁగ

## ఆంధ్ర కవి స్తుతి

సీ॥ నన్నయోత్పలమాల చెన్నుమీరుచునుండు
తిక్కన కందంబు తీపి మెండు
ఎఱ్ఱనార్యుని గీతమెంతొ రమ్యత నొల్కు
శ్రీనాథు సీసంబు చెలువుఁ గుల్కు
సోమనాథు ద్విపద సొగసుగా నడయాడు
పెద్దన మత్తేభ మొద్దికఁదగు
రాయలపల్కులో రాళ్ళు రాపాడును
మూర్తి శార్దూలంబు బొబ్బరించు
రఘునాథు నడకలో రాచఠీవి వెలుంగు
నన్నెచోడు పదాల తెన్ను వేఱు
వేమనతో నాట వెలది నృత్యము సేయుఁ
బోతన యన్నింటిఁ బోతపోయుఁ

తే॥ జేమకూరన్న పాకానఁ జిందు రసము
సూరనార్యుని కల్పనాశుద్ధి ఘనము
గజ్జెగట్టిన జెట్టులు గాన వీర
లందఱకు నొక్క వందన మాచరింతు.

(ప్రార్థనానంతరము వంతవారలలో నొకరు)

వంత:- ఓ యక్షగాన విశారదా! నేఁడేకథాసుధారసమ్మున ఈ మహాజనుల సంతోషపెట్టఁ దలఁచితివి?

కథకుఁడు:- ఏమహనీయుఁడు క్రీస్తుకంటె మహమ్మదుకంటె కొన్ని వందల సంవత్సరములు ముందె ఈభారతదేశమున జన్మించి నవమోహనాంగియగు భార్యను ముద్దులబిడ్డను రాజ్యరత్న సింహాసనమునుద్యజించిఘోరతపస్సుచేసిజగద్గురువై అహింసా పరమో ధర్మః మమాత్మా సర్వభూతాత్మా- అనుధర్మమ ముల ప్రాశస్త్యము ప్రచించి యనుష్ఠించి యనుష్ఠింపఁజేసెనో విశ్వాంతిదాత గాంధీమహాత్మున కాదర్శపురుషుఁడో, ఏవిశ్వ

శ్రీ యోఽర్థి ధర్మచక్ర మవక్రమై యావద్భారతమునఁ బ్రకా
శించుచున్నదో యట్టి బుద్ధభగవానుని దివ్యకథ వినిపింపఁ
దలఁచితి.

వంత:- బుద్ధదేవుని చిత్రములు బొమ్మలు నిత్య మెల్లయెడలఁగనఁ
బడుచుండునుగాని యాపుణ్యపురుషుని జీవితచరిత సమగ్ర
ముగ నాకు ను దెలియదు. అదివినుభాగ్యము నేడుగలుగు
చున్నందులకు సంతసించుచున్నాఁడ.

కథ:- మంచిది. విను.

— రగడ —

ఆనందంబుగ బుద్ధచరిత్రము- అయ్యలార వినుఁడీ
మానసమందున యోచనచేసి- మంచిదారికనుఁడీ
ప్రజలమేలునకు రాజ్యము విడిచిన-ప్రజా సేవకుండు
విజనాటవులందవస్సేసిన- విశ్వదాత యతఁడు

## సిద్ధార్థుని జననము

(కథాప్రారంభము) (మరాటీ పక్కి)

శ్రీరంజిల్లెడి భారతమాతకు- శిరోభూషణంబు
సారాచార విచార ధీరులకు- సహజపోషణంబు
సోమసూర్యమణి సాధరాజముల- సొంపుల నింపొందు
రామరాజ్యమన శాక్యులరాజ్యము- రాజిల్లఁగనందు
కలదు రోహిణీనదీతీరమునఁ- గపిలవస్తు పురము
కలకాలంబును భోగభాగ్యములఁ- గలకలలాడుచును
అపురమేలెడి రాజుశౌర్యమున- అమరవరుల మించె
చాపహస్తుఁడై యుద్ధరంగమున- శత్రుల నోడించె.
శుద్ధచరిత్రుఁడు శుద్ధోదనుఁడు- సూర్యవంశజుండు
పద్ధతి మీఱక ప్రజలహాయిగాఁ- బాలించుచునుండు
ఆతని కిద్దఱు భార్యలుండిరి- అనుపమగుణవతులు
నీతిని దప్పని శాంతమానసలు- నిత్యసత్యవ్రతలు
మాయాదేవి గౌతమి యనెడి- మానవతులు సతులు
ఛాయాదేవి దినమణి నట్టుల-చక్క- ననుసరింతుర్రి
చాలకాలమటు లాఁపురముండఁగ- సంతానము లేక

ఏలరాజ్యమని చింతలు పొందుచు— ఇంతులతోఁగూడి
దేవతార్చనలు తీర్థయాత్రిలను— దిరముగఁజేయుచును
సావకాశముగఁ జెట్టుకు పుట్టకు— సల్పిరి పూజలను

వ॥ ఇట్లు సంతానముకొఱకు భగవంతుని ధ్యానించుచుండ, ఒక దినమున మాయాదేవి నిద్రించుచుండ కలలో—

జరజర వచ్చెను— దేవవిమానము (తందాన)
చరచర డిగిరట— దేవకన్యలు
మాయాదేవిని— ఆవిమానమున
హాయిగఁ జేర్చిరి— దేవకాంతలు
ఎగిరిపోయి ఆ— దేవవిమానము
దిగినది చల్లఁగ— గంగయొడ్డునకు
గంగాజలముల— జలకమార్చిరి
బంగరుతీఁగల— బట్టకట్టిరి
మణిపీఠమ్మున— కూర్చుండఁగా
మణిహారమ్ములు— వేయుచుండఁగా
కోమలమూర్తి— నిండుచందురుఁడు
ఆమెగర్భమున— ప్రవేశించెను
కొక్కొరోకోయని— కోడికూసెను
దిక్కులుతెలతెల— తెల్లవారెను
కలవరపడుచు— లేచినాథునకు
కలలోజరిగిన— దంతయుఁజెప్పె

వ॥ అట్లు సెప్పఁగా శుద్ధోదనుఁడు విని జ్యోతిశ్శాస్త్రజ్ఞుల పిలిపించి మాయాదేవికి వచ్చిన స్వప్నమును తెలుప వారది సంతాన ఫలసూచకమని విన్నవించిరి. అంతఁగొంతకాలమునకు ఆ యమ్మ గర్భమును ధరించి ప్రసవించుటకు దేవదహానమునం గల పుట్టినింటికి వెళ్ళుచుండ మధ్యేమార్గమున లుంబినీవనములో ఒక శుభముహూర్తమునఁ బ్రసవించినంత.

— రగడ —

చూడంజక్కని ముద్దుల బాలుఁడు— సుతుఁడొకఁడుదయించె
వేడుకతోడను వృక్షలతాదులు— విరుల వాన నించె

జలజల పొంగెను నదుల జలంబులు- సంతోషముమించె
కలకల కూసెడి పక్షిజాలముల- గానము రాణించె
నవ్వుముఖంబుల దాసీసంఘము- నాట్యమాడఁగాంచె
అవ్వ యొకర్తుక యప్పటిపనులకు- అజ్ఞల నిప్పించె
తగినటు బిడ్డను దివ్యజలంబుల- తానంబాడించె
అగరుగంధముల సాంబ్రాణిపొగ- హాయిగ వేయించె

జో ల పా ట

రాగము- మధ్యమావతి

వేదవేదాంగాది- విజ్ఞానదీపా
ఆదినాగకలాప- అచలేంద్రచాపా ॥లాలీ॥
సనకాదిఋషులెల్ల- సన్నిధింజేర
ఘనమైనవేదాంత- గతిఁజూపు ధీరా ॥లాలీ॥
దక్షిణామూర్తివై- తమమణఁచుజ్ఞానీ
అక్షీణమగుతేజ- మందిచ్చుమౌని ॥లాలీ॥
పరమార్థచింతతోఁ- బ్రార్థింతు నీశా
వరదయాదృష్టితో- వరలు పరమేశా ॥లాలీ॥

వ॥ అని జోలపాడె, అంతఁగొంత విశ్రాంతిననుభవించి,

— రగడ —

తల్లిబిడ్డలను బంగరుపల్లకి- తగినటు చేర్పించె
మెల్లఁగ నింటికిఁ జేర్చి రాజునకు- మేలది వినిపించె.

వ॥ అవ్వార్త విని మహారాజు సంతోషసాగరమున నోలలాడుచు-

— రగడ —

వాడవాడల పండువు సేయఁగ- వార్తలఁ బంపించె
పొడిమి మీఱఁగ అన్నదానముల- పూర్తిగఁజేయించె
వేనవేలుగా వచ్చిన జనముల- వేడ్కలు కనిపెట్టి
పానకంబు వడపప్పు చక్కెరయు- పండ్లు పంచిపెట్టె
అసితుండనియెడు మహర్షియొక్కఁ- డచ్చటి కేతెంచె
పసిబిడ్డంగని దివ్యచిహ్నముల- బాగుగఁబరికించె
కానీ మాయాదేవినిగాంచి- కంటనీరు గార్చె
మహానుభావుఁడు కొడుకైపుట్టెను- మహారాజ యనియె

మహాత్ముఁడాఋషి తపస్సుచేయఁగ- మరల గుహకుఁజనియె.
ఆఱుదినమ్ములు గడచిపోయెను- ఆనందముతోడ
మాఱుమ్రోగెను దానధర్మముల- మహారాజు మేడ
ఏడవదినమున మాయాదేవికి- ఎసఁగి జ్వరము కాచె
పాడుజ్వరంబది చివఱకు ఆయమ- ప్రాణములను దీసె
కాఱుమేఘములు గమ్మినరీతిగఁ- గాంతలు గుమిగూడి
బోరున నేడ్చిరి ఆమహిళామణి- పుణ్యము కొనియాడి
కొండలరాయని గుండెలుగరఁగెను- ఘోషించెను గడలి
దండిదొరలు కన్నీరుగార్చిరి- ధైర్యమ్ములు సడలి
కష్టసుఖంబులు కావడికుండలు- గాజగాన నుండె
నష్టభార్యుఁడై రాజుదుఃఖమున- నవసి కుఁదుచుండె
తల్లిపాలకు బిడ్డనోటికి- దైవఁబెడఁబాపె
చెల్లెలు గౌతమి కన్నివిధంబుల- చింతలు తలమోపె
శుద్ధోదనునకు దిక్కులన్నియును- శూన్యముగాఁదోఁచె
బుద్ధిమంతుడగు మంత్రి యాతని- బుద్ధి శాంతపఱచె
అంతట రాజు బుధులను బిలిచి- ఆఱుమాసు డాసి
సంతసమందఁగ వారికి గొప్పగ- సన్మానముచేసి
సిద్ధపురుషులకు నుండెడిగొప్ప- చిన్నెలన్నిగాంచి
సిద్ధార్థుండను నామకరణమును- జెలువుగఁజేయించె
తల్లిలేని యాపిల్లవాని పిన- తల్లి పెంచుచుండె
తల్లిదండ్రులకుఁబెన్నిధివోలెను- తనయుఁడు తానుండె

౫॥ ఆబాలుఁడు శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిగాంచుచుండ

— రగడ —

విశ్వామిత్రునియొద్ద బాలునకు- విద్యలు నేర్పించె
విశ్వరక్షణకు ధనుర్వేదమును- వేదము గఱపించె
పదియునెనిమిది వత్సరంబుల- ప్రాయముచనుదెంచె
ముదమునఁగళలందేలియాడుచును- ముద్దులుకురిపించె

## హంస రక్షణము

వ॥ అంత నొకనాడు సూర్యోదయ సమయమున ప్రాతఃకాల వ్యాయామవిహారమునకై గుణదత్తుఁడను ప్రాణస్నేహితుఁడును తానును గుఱ్ఱముల నెక్కిరి. గుణదత్తుఁడు గుఱ్ఱమును విడిదిన వెంటనే సిద్ధార్థుఁడు వైరిజనకంటకమగు తన కంటకమును మొత మీఁదదువ్వి.

కళ్ళెము లాగి విడువఁగా........ పై
గల్లన గజ్జెలు మ్రోఁగఁగా
ఉల్లాసమ్మున సాగఁగా
పెల్లుగ ధూళులు రేగఁగా
రాజమార్గముల నేగుచు
రాజుల దృక్కులఁదోఁగుచు
ప్రక్కగుఱ్ఱమును మించఁగా
ఒక్కపర్వునను పాఱఁగా
సెలయేఱులపై దూఁకుచు
పులమెట్టుల కెగఁబ్రాకుచు
పచ్చిక బయళ్ళఁబాఱుచు
పచ్చని పొదలం జేరుచు
ఉఱిమెడ మబ్బుల మెఱుపుగా
నురుగులు గ్రక్కుచుఁబోవగా
హిమగిరి వనములు చేరఁగా
క్రమమున నాఁపెను మెల్లగా ........

వ॥ అంత మిత్రు లిర్వురు గుఱ్ఱములు దిగి పాఱుచున్న సెలయేళ్ళను పరుగెత్తుచున్న లేళ్ళను, కూయుచున్న పక్షులను, కాయుచున్న వృక్షములనుచూచుచు రోహిణీ నదీతీరమున విహరించుచుండిరి. అప్పుడ దేవదత్తుడను క్షత్రియబాలుఁడు సహచరులతో వేట కొఱకు బయలుదేఱుచున్నాఁడు. ఎట్లన -

— గేయము —

నల్లని తలగుడ్డసుట్టి

తెల్లని చల్లడముదొడ్గి
గజ్జెల గుడిగిని గట్టి
పచ్చని పెనుదట్టిసుట్టి
పచ్చల పిడిబాకుదోపి
పెద్దవింటిని జేతఁబట్టి
చక్కని పెన్జీను వేసి
ఎఱ్ఱని గుఱ్ఱంబు నెక్కి
జిఱ్ఱునఁ గళ్ళెంబులాగి
వేగఁగదలెను దేవదత్తుఁడు- నారాయణ।
సాగుఁడీ సాగుఁడీయన్నాఁడు- నారాయణ॥
నెట్టనఁ జిట్టడవిమెట్టి
బిట్టు పెడబొబ్బలను బెట్టఁగఁ
గ్రేళ్ళువాఱెను లేళ్ళగుంపులు
గుఱ్ఱుగుఱ్ఱని కిరులు దిరిగెను
కాంౘ్రు కాంౘ్రని పులులుపర్విడె
వేఁటలాడెను దేవదత్తుఁడు_ నారాయణ।
తరిమితరిమి వానిఁగొట్టెను- నారాయణ॥

వ॥ ఇట్లతఁడు వేఁటలాడుచు యువరాజున్న ప్రాంతమునకు వచ్చెను. అత్తఱి ఆకాశమార్గమున ముత్యాలవరుసలవలె, నక్షత్రతోరణములరీతి తెల్లతామరపూలచాళ్ళనా రాజహంసలు బారులు దీరి వచ్చుచుండె. ఆహంసలలో నొకదానిని దేవదత్తుఁడు బాణముతోఁ గొట్ట అది విలవిలఁ దన్నుకొనుచు సిద్ధార్థుని కాళ్ళముందు పడ అతఁడు దానిని లేపనెత్తి మెల్లఁగా బాణము పెరికి కాఱుచున్న నెత్తురు తుడుచుచు కన్నీరువిడుచుచు అక్షీణ ప్రేమమున్మ్రాన దానిని రక్షింపఁదలంచి.

ఉ॥ ఎక్కడ జన్మభూమి? సతియెవ్వతె? బంధువులెవ్వ? రేటికి
దిక్కున కేఁగెదెంచి? తతివీనపుఁజూపులె యుత్తరంబులా
ముక్కున కెంపుడాలు తలముందఱ గోదుమవన్నెలీను నీ
చక్కని మేను క్రూరనరశాతశరాహతమయ్యెనక్కటా!

వ॥ అనిపక్షిని ఓదార్చుచుండ -

ఉ॥ ఎవ్వఁడవీవు క్రొవ్వడర ఇవ్వని(జొచ్చితె మచ్చరాహతిన్
దవ్వులనుండి తూలి యిటు దాపుగఁజేరిన నండజంబు నీ
వెవ్విధిఁబట్టికొంటి? తగవే పెఱవారల సొత్తుదాక ఈ
మవ్వపుహంసమాంసరతి మానుము జీవితవాంఛయున్నచో

వ॥ అని సగర్వముగాఁబలుకుచు సమీపించిన దేవదత్తుని మాటలువిని
సిద్ధార్థుఁడుపక్షివంక కరుణాన్వితదృష్టి ప్రసరించి వానితో నిట్లను

ఉ॥ తామరతూడులందినుచు- దప్పికి గ్రుక్కెడు నీళ్ళు గ్రోలుచున్
వ్యోమవిహారముం జసలుపు- చొక్కనికే నపకారిగాక లో
నామనుమా తెఱుంగక హిమాచలమానసవాసియైన యీ
కోమలరాజహంస పడఁగొట్టఁగ జేయెటు లాడెఁజెప్పుమా

వ॥ దానికి దేవదత్తుఁడు వికటముగ నవ్వి-

— రగడ —

క్షత్రియవరులకు వేఁటలాడుటయె- శాస్త్రసమ్మతమ్ము
పాత్రమెఱుఁగక మాటలాడెదవు- బాగుబాగు పొమ్ము
అహింస యెవరికి బోధించెదవది- అందరాని సొమ్ము
సహింపఁజాలను నీమాటలనిఁకఁ- జాలుఁజాలు తెమ్ము

వ॥ అనవిని అమృతమొలుకు చంద్రబింబములో రాహువుతనవిసఁపుగోర
గుచ్చినట్లుబాణముదీని మేనిలో నాటితివి. ఇదినన్నుశరణుసొచ్చినది;

— రగడ —

అభయమిచ్చితిని పక్షివిడుచుట- అన్యాయమునుమ్ము
శుభముగ నీకొకవిందు సేసెదను- సోదర యిటురమ్ము
అని సిద్ధార్థుఁడుపల్క దెవదత్తుఁడు సక్రోధుఁడై
రాగము- జంఝూటి- దరువు

ఏలరా- తేఁడా- విడరా- యేరా- కూరిరా।
చాలుచాలు-నాఁగుమాఁగు- మించుకైన భీతిలేక
ఖగరాజముఁగొనఁ బాడియా- గాసిల్లఁగ జూడఁదగ ॥ఏలరా॥
అలకింపు నామాటల- అజ్ఞానంబు వీడుమింక
నేను గొట్టిపట్టిపిట్ట- నెట్టు నీవు తీసికొందు ॥ఏలరా॥
సంగతిని దెలిసికొనక- భంగమిపుపొందగఁను

ప్పాంగుట తగదంటి నంత- రంగమును మార్చుకొను ॥మేలరా॥

వ॥ అనుడు సిద్ధార్థుడు దేవదత్తా ఈబాణము నీ శరీరమున గుచ్చుకొనుము. ఎంతబాధగలిగించునో నీకే తెలియఁగలదు. ఐననీ వేల ఖడ్గము ధరించితందువా? అది సాధుసంరక్షణార్థము అని యనుచుండ దుష్టశిక్షణార్థమని. ఇఁకఁదీఁగలాగినపొదకదలును.

—రగడ—

శరణునరక్షణచేసెడివారే- సత్యధర్మపరులు
కరుణలేకహింసించెడివారే- కాలునిసహచరులు
గయునిరక్షణకుఅర్జునుఁడేతన- గాండీవముపట్టె
గయనిభుఁడగుశిబిపక్షినిఁబ్రోవఁగ- కండలొలిచిపెట్టె
కావునఁబక్షినిరక్షించుటయే- కాఁగలకార్యంబు
నీవిఁకమాటలఁదూలనాడకుము- నిలుపుముశౌర్యంబు

తే॥ గీ॥ బాలు రువ్వెడు వానిపైఁబూలు రువ్వి
శాంతి భద్రత లందుటే సముచితమని
పాములకుఁబాలు పోయు నీభరతభూమి
హంసలను గొంతుకోయువాఁడవతరించె

వ॥ అన దేవదత్తుఁడాగ్రహోదగ్రుఁడై

—రగడ—

సూర్యవంశజుల పరాక్రమము చవి- చూడదలఁచితేని
ఆర్యధర్మముల ననుసరించి మా- టాడ కీయఁదేని
పక్షికి బదులుగ నీదుప్రాణములె- బలియగుననుకొనుము
పక్షపాతముగ మాటాడెదె నీ- బాణమందుకొనుము.

వ॥ అనుచుండ అతనిముఖమున

రోసము గొప్పగఁ దోఁచెను ...సై...
మీసముఁ ద్రిప్పుచు చూచెను
కంటనిప్పుకలు గ్రక్కుచు
కంటునఁ జిందులు ద్రొక్కుచు
చీల్చెద వక్షము రెండుగా
తాల్చెద ప్రేవులు మెండుగా
రారా రమ్మని పిల్చెను
వీరావేశము తాల్చెను

అంతట ఆగుణ దత్తుఁడు
పంతము మీఱిన చిత్తుఁడు
సింహగర్జనము సల్పఁగా
సంహృతికొఱ కుసికొల్పఁగా
ఇరువురు కత్తులు దూసిరి
గిరగిరఁ ద్రిప్పఁచు డాసిరి.
ముద్దుల రాజకుమారుఁడు
ఇద్దఱి నడుమన చేరెను ...

వ॥ చేరి గుణదత్తునిజూచి మిత్రమా! పక్షిని రక్షింపదలంచి ఖడ్గ యుద్ధమునకు సిద్ధపడుట ముల్లుదీసి ఆ గాయములో దబ్బనము గ్రుచ్చుట. నామాట విని నీకత్తి నొఱలో వేయుమనె. ఇంతలో ఈ వార్త దెలిసి శుద్ధోదనమహారాజు మంత్రితో అచ్చటికివచ్చె. రాజకుమారుఁడు తండ్రికి నమస్కరించె రాజునుజూచి దేవదత్తుఁడు తనకత్తి నొఱలో వేసికొని తాను గొట్టిన హంసను సిద్ధార్థుఁడు తీసికొనెననియు మీరుచెప్పి యిప్పింపుఁడనియుఁగోర అప్పుడతఁడు కొడుకును గని.

— రగడ —

ఇతరులసొమ్మును విసమువోలెని- వేలచూడవన్న
మతిలోనైదను ధర్మము దప్పిన- మర్యాదలు సున్న
ఈతఁడు కొట్టినహంసను నీవిపు- డేల తీసికొంటి
తాతల తండ్రుల వంశంబునకే- తగనిమాట వింటి.

వ॥ అన సిద్ధార్థుఁడు వినయమున నిట్లనె.

— రగడ —

పాతకమంచును నెంచక ఈతఁడు- పక్షినిబడఁగొట్టె
వాతాహతిచేవచ్చి యిద్దినా- పాదములనుముట్టె
కొట్టినవెంటనె పట్ట చావఁదా- గోరుట ధర్మమ్మొ
అట్టుగాక యిదిశరణుసొచ్చినది- అతని యాశవమ్మొ
అభయమిచ్చితిని రక్షణసేయఁగ- అప్పుఁడు వినుచుండ
ప్రభువులకియ్యది ధర్మమార్గమని- పలువురనుచునుండ

వ॥ ఇట్లతఁడు బదులు సెప్ప.

— రగడ —

వయ్యానవేమియుఁ దోఁపకజనపతి- సచివాగ్రణిఁగనియె
తియ్యనిమాటల న్యాయముతప్పక- తీర్పుచెప్పమనియె
ఘటనాఘటన సమర్థత గల్గిన- ఘనుఁడుమంత్రివరుఁడు
దిటవుగ రాజ్యము నడిపింపంగల- ధీరుఁడు పావనుఁడు
ఆలోచించెను మంత్రిపుంగవుఁడు- హంసవిషయమంత
కాలిమితో బహుధర్మ సూక్ష్మములు- తనకుఁదెలిసినంత
కొట్టినహంసను వేఁటకాఁడుతాఁ-గోరుటసత్యమ్ము
పట్టినప్రతినయ వీడుమంటయును-బాడిగాదనుమ్ము
పాలును నీరును వేఱుసేయఁగల-పక్షియిద్దిరాజా!
తేలును ధర్మము హంసరాజమును-దింపుముయువరాజా!

వ॥ అవి అంచనుదింపించి "మీరిద్దఱు పక్షికొఱకుచేతులు చాపుఁడు ఎవరిచేతుల లోనికి ఈపక్షివచ్చునో వారిదేయిది." అనిమంత్రి గారన నిర్వురు సమ్మతించిరి. దేవదత్తుఁడు ముందు చేతులు చాచెనుఅదిభయపడి వెనుకకదుగిడెను. గౌతముఁడుచేతులుచాప పూర్వస్నేహమున నడచివచ్చి ఆతని కరములంజేరెను. అంత

— రగడ —

ధర్మమెజయమని గుణదత్తుడంట- ధైర్యముతోఁ బలికె
నిర్మలహృదయముతో వనదేవత- నిండారఁగఁగులికె!
పకపకనవ్వెను కొండజాతి ప్రజ- పరికించుచునుండ
ప్రకటితమయ్యెను దైవశక్తి ఆ- పక్షిబుదినుండి
దేవదత్తుఁడది పరాభవమ్మని- తిరముగ మదినమ్మె
కావరమంతయుఁ గోపరూపమున- కన్నుల నెగఁజిమ్మె
సమయముచిక్కిన నపకారంబును- సలుపఁ దలఁచుచుండె
కుమతియెట్టులే దుష్ప్రిచారమును- గూర్పఁబొంచియుండె

వ॥ అంత రాజాజ్ఞచే ఎవరియిండ్లకు వారేగిరి. పిమ్మట ఒకదినమున శుద్ధోనుఁడు మంత్రినిజూచి "ఆర్యా! సిద్ధార్థుఁడు

— లలితకళా వినోదము — - రగడ -

ఎప్పుడు ఏదోవిచారమున జగ- మెఱుక మానినాఁడు
తప్పక సంతోషంబును గూర్చెడి- దారిచూడుఁనేఁడు

క్షాత్రధర్మమున కనువగు మార్గము- సాధింపఁగలేఁడా
గోత్రఖ్యాతిని వృద్ధిసేయఁగల- కోవిదుండుకాఁడా

వ॥ అనిచర్చించి రోహిణీతీరమున నందనోద్యానముఁబోలిన వనములో ఎండ చలి వానల బాధలు తెలియకుండునట్లు ఇంద్రభవనము వంటిభవనములు మూఁడుకట్టించి చెన్నునిసారథిగనిచ్చి బాహ్య ప్రపంచము గోచరము కాకుండునట్లు సిద్ధార్థునందుంచె. అచట

— రగడ —

బృందావనమును ధిక్కరింపఁగల- ఎలదోఁటలపూలు
బృందారకులకె వింతగొల్పఁగల- ఎంతోతావిఁగ్రోలు
జలయంత్రమ్ములు తామరచెఱువులు- జలపక్షులుమెండు
చిలుకల హంసల నెమిళ్ళతోడనుఁ చెన్నుమీఱుచుండు
చిత్తరువులు బహురత్నతోరణాల్- సింగారముతొలుకు
అత్తరు పన్నీరిచ్చెడివాసన- ఆనందముచిలుకు
హంసతూలికా తల్పంబులతో- అలరారుచునుండు
హింసాకరమగు దృశ్యంబేదియు- ఎఱుకపడకయుండు

వ॥ అప్పుడు మహామంత్రి — రగడ —

అందగత్తెలగు ఆటకత్తెలను- అచటికి రప్పించు
నందముగా నటమూఁడు పూటలును- నాట్యముసేయించు

వ॥ పుష్పబాణుని క్రొంగొత్తపూవులమ్ములోయన నొప్పునాపూఁబోడులు హల్లీసకాదినృత్యము లొనర్చుచుండఁ జూపఱకు స్వర్గమున దేవేంద్రసభలో రంభ,ఊర్వశి,మేనక,ఘృతాచి, తిలోత్తమాదులు నాట్యముసేయు చున్నట్లుండు. ఎడనెడ శృంగారరసప్రధానములైన ఉషాపరిణయము, రాధాకృష్ణుల పరిణయము గోపికావిరహము మొదలగుకథలగేయనాటికలుగఁబద్యంచుచు ప్రేమరసమును మృదుమధురగేయరూపమునఁగుమ్మరింతురువెట్లన

కాంభోజిరాగము- ఆదితాళము

ఏమోహభ్రమ గల్గెరా- నీమోముఁజూడనా ॥ఏమో॥
రతిపతినిభ చిఱునగవునరా నీయధరా
మృతమతి ముదమునఁ గ్రోల నా ॥ఏమో॥
తాళఁజాలరా మరునిశరములతు

జాగదేల బిగికౌఁగిటఁ జేర్పనా ॥కేమో॥
కోమలాంగనే కోరి చేరితిని
కామకేళివిలాస పాథంబు చేరరా
కోర్కి దీర్పరా కొసరి వేడుచుంటి నవ
మోహనాంగనా ........ ॥కేమో॥

వ॥ ఇత్తెఱంగున లలితకళా విలాసముల మానసికానందము పొందుచుండ నియ్యది యదనని గౌతమునకు వివాహముసేయ తలిదండ్రులు నిశ్చయించుకొనిరి. ఇంతలో శాక్యులకొక పండువు రాఁగా రాజగృహంబున గౌరీవ్రతంబుసేయ సంకల్పించిరి. ఆ సమయమున అచటి, రాజకన్యల రప్పించివారికి బంగరు బహుమతుల నిప్పించి వారిలో సిద్ధార్థుఁడు కోరిన కన్యనతనికి భార్యగాఁ జేయవలయునని మహారాజుగారు సచివాగ్రణికిఁ దెలిపిరి. అంత మంత్రి తత్క్రతుకృత్యముల నిర్వర్తించుచు

: కల్యాణము :

— రగడ —

అన్నిదేశముల రాచకన్నెలకు- ఆహ్వానము లంపె
కన్నెలకీయఁగఁ గనకవస్తువుల- గదులుకొన్ని నింపె
తెల్లవాఱు సరికెల్ల పట్టణము- దివ్యకళల వెలిఁగె
ఉల్లాసంబునఁ బ్రజాసమూహము- లుత్సవమున మెలఁగె
వచ్చిరి పలువురు రాచకన్నియలు- వ్రతమును వీక్షింప
తెచ్చిరి పూజాద్రవ్యములెన్నో- దేవుఁడు రక్షింప

వ॥ అత్తఱి కోలీపట్టణంబున సుప్రబుద్ధభూపాలునికూఁతురు యశోధర గౌతముని సౌందర్య సద్గుణాదులువిని అతనిని వరించి గౌరీవ్రతమునుజూడ తండ్రి యనుమతింప తల్లితో పల్లకి నెక్కి కపిలవస్తుపురము సేరె.

— రగడ —

అందముచిందెడి దేవకాంతలును- ఆమెకు సరిగారు
ఇందునిభాస్యకు విద్దెలలోపలను- లేరుసాటిరారు
తొలకరిమెఱుపును మించిమెఱయు ఆ- తోయజాక్షి మేను
కలుములచెలివలె సర్వభోగముల- కాంచఁగలదు తాను

వ॥ అట్టి యశోధర సౌందర్యమునుజూచి సిద్ధార్థుఁడు ముగ్ధుఁడయ్యె ప్రథమదర్శనంబున వారియిర్వురి చూపులొండొంటిగాఢాలింగన మొనర్చుకొనె. గౌరీ వ్రతమున రాజపుత్రుఁడు రాజకన్యలకు బంగారు బహుమతులనిచ్చుచు పితృదత్తరత్నహారమును యశోధరకిచ్చె. మంగళగీతములతో వ్రతము పూర్తియయ్యె. యశోధరను తనకుమారునకిమ్మని శుద్ధోదనుఁడుదండపాణి భూపాలుని గోరె. దేవదత్తునిదుర్బోధచే సిద్ధార్థుఁడు పిఱికిపందయని నమ్మి దండపాణి ముందుగఁదనకూఁతు నీయ సమ్మతింపక ధనుర్విద్యా ప్రదర్శనము జరిపించియందు సిద్ధార్థునకే ప్రథమబహుమతిరా అప్పుడతనికిఁ దనకూతునిచ్చి మహావైభవముతోఁ బెండ్లిచేసె.

— రగడ —

పట్టినదెల్లను బంగారంబుగఁ- బరిణమించుచుండె
ముట్టినదెల్లను ముత్తెమ్మై కడు- మోదమొసఁగుచుండె
చుక్కలనాతఁడు పూర్ణచంద్రువలె- చూడఁబడుచునుండె
ఎక్కడచూచిన విలాసదృశ్యము- తెసకమెసగుచుండె

వ॥ ఆమె శృంగారరసవాహినియైపొంగె, అందతఁడు రాజహంసయై తేలియాడుచుండె. ఇట్లా నూత్న దంపతులు రతీమన్మథులవలె రాజభోగములనుభవించుచుండఁ గొంతకాలమునకు వారికి రాహులుఁడను కొడుకుపుట్టె. తరువాత ఒకనాఁడు రాజకుమారుఁడు తన పట్టణమునఁగల ప్రజలజీవయాత్రలెట్లున్నవో చూడవలయునని తండ్రికిఁ దెలియకుండ పోవనిశ్చయించుకొని విశ్వాసపాత్రుఁడైన చెన్నునితోగూడిఁ మాఱువేషములతోఁ బట్టణ ప్రధానవీధిఁ బ్రవేశించెను.

## : నగర సందర్శనము :

— రగడ —

పూచినతంగెడు వోలెనుండెను- పురవీధుల చాలు
చూచుచువారలు రాజమార్గమునఁ- జొచ్చిరి అప్రోలు
ఈఁగలురేఁగిన తేనెతుట్టివలె- ఎనగిరి జనులెల్ల
ఏగతిఁజూచిన రాకపోకలకు- ఇంతయెడముకల్ల

బట్టలకొట్టులు వెండియుంగడులు- బంగారపుఁగొట్లు
బుట్టలుతట్టలుక్షీపండ్లబజారులు- పూవులమ్ముచోట్లు
మల్లెలుమొల్లలు సన్నజాజిచే-మంతులుబంతులతో
వెల్లివిరిసె నొకవీధియంతయలి- వేణుల బంతులతో

వ॥ ఆ పూలబజారులలో పూవులమ్ముకొనుచు, కొనుచునున్న యువతీయువల చమత్కారవచనములెట్లున్నవన-

— రగడ —

సగమువిచ్చినది ఈగులాబివెల- సరిగఁ జెప్పుబాల!
వెగటుగనుండిన కొనవలపెగుము- వేయిమాటలేల?
బొందుమల్లెలను వలిపెములోపల- పొందుపఱచితేల?
దండిదొరలుగని ధరనిచ్చినచో- దాచుకొనముపూల
ఎన్నితుమ్మెదలు త్రాగిపోయినవొ- ఈపువ్వులరసము
ఎన్నిత్రాగినను వాడవించుకయు- ఎందుకింతహసము
వాడినకొలంది వింతవాసనలు- వచ్చెడీ సంపంగి
అడుము బేరము అన్నియునొసఁగెద- అవసరమునవంగి

వ॥ అనిపల్కుచుండ విని వారుపోవుచుండఁగా ఒక ముదుసలితొక్కు కఱ్ఱమోటించుకొనుచు భిక్షాపాత్రచేతఁ బట్టుకొని-

— రగడ —

కన్నులులేని కబోదిని బాబూ- కనుఁడు నాదుగోడు
పున్నెముగలుగును దానముసేయుఁడు- పొట్టనిండునేఁడు
దిక్కులేని యీపక్షిని బ్రోవఁగ- దేవుఁడుమిముఁజూపె
మ్రొక్కుచుమీరిడు రాగిడబ్బుకై- ముదుసలిచేచాపె
ఆఁకలితీఱక నకనకలాడుచు- అల్లాడెదసామీ
మీకిది తెల్పఁగరొప్పవచ్చెడిని- మేనబలములేమి
పక్కలెండినవి డొక్కలాగినది- బరువైనది బ్రతుకు
గ్రుక్కనఁజూచెడి వారులేమిచే- కఱవైనది మెతుకు
చంకనున్న మీచక్కనిబిడ్డఁడు- సరిగవృద్ధిపొందు
శంకరుకృపచేమీగృహంబునను- సౌఖ్యము పెంపొందు

వ॥ అని దీనాలాపములాడుచున్న బిచ్చగాడినిజూచి ఆశ్చర్యపడి సారథింగని చెన్నా!

చ॥ తనువున రక్తమాంసములు తగ్గి నరంబులు పైకినుబ్బి తె
ల్లని కురులెల్ల వ్రేల ముఖలాల తొఱంగ తెఱంగు తోఁపక
వణకుచు వింటిబద్దవలె వంగి కరంబునఁ గఱ్ఱయూఁతగాఁ
గొని నడయాడలేక కడుఁగూయిడు ఈతఁడెవండు తెల్పుమా

వ॥ అని యడుగ నాల్గుదశలం గడపటిదశయిది యనిచెప్ప దానికి

బుద్ధుఁడు
"నేనును ఇట్టిదశ అనుభవింపవలయునా?"
"ఔను"
"నీవో"
"నేనును"
"యశోధరకూడనా"
"ఆమెయు"
"రాహులుఁడు"
"రాహులుఁడు గూడ"
"చెన్నా! నాకడుపులో చేయి పెట్టికలచినట్లున్నది"

వ॥ అనియిరువురకు సంభాషణ జరిగినపిదప నాలుగడుగులు నడవ ఒక కుష్ఠరోగి కనఁబడె, ఆతనినిజూచి సిద్ధార్థుఁడు సారథీ! ఒడలు జలదరించుచున్నది.

ఉ॥ ఈగతి నేలపైఁబడి వచింపఁగరాని నికృష్టజీవియై
వాగుచులేవలేక చెడువాసనచే తనవంక కెవ్వఁడుఁ జ
మూఁగుచునున్న యీఁగలను మూల్గుచు చేతులఁ గాళ్ళఁదోలుచున్
దోఁగుచునుండె రక్తమునఁ దోఁపక యెవ్వఁడు వీఁడు సెప్పుమా

వ॥ అన ఈతఁడు కుష్ఠరోగియని చెన్నుఁడు చెప్పెను. దానికాతఁడు

— రగడ —

ఏకారణమునఁజూడ సహింపని- ఈరోగము గలుగు
ఏకదీక్షతో నెవనిభజించిన- ఈపాపము తొలఁగు

వ॥ అనిప్రశ్నింప చెన్నఁడు శిశుహత్య స్త్రీహత్య మొదలగు మహా పాపములు చేసినవారికి ఇట్టి దీర్ఘవ్యాధులు గల్గునని పెద్దలను చుందురు. కావున నివిచర్మవ్యాధులుగావు, కర్మవ్యాధులని పల్కెను. సిద్ధార్థునిమనసు నీరైపోయె ముఖమున విచారము తోఁచె. ఈవ్యాధికి మందులేదాయని పృచ్ఛింపనాతండోఁపదని చెన్నఁడుచెప్పె. ఇట్లు సంభాషించుకొనుచు పట్టణపు చివరి భాగమునకు వచ్చినంత పేదల కొంపలుచూచి సిద్ధార్థుఁడీ జీర్ణ కుటీరముల నివసించువారెవరన

— రగడ —

కండలుగరఁగఁగ మేడిపట్టుకొని- కష్టించెడివారు
నిండుమనంబున భూమినినమ్మిన- నీతిపరులువీరు
ఎఱ్ఱనియెండని జోరునవానని- ఎపుడు జంకఁబోరు
నఱ్ఱల అంకెలు లెక్కసేయకయ- నాఁగలితోలుదురు.
మట్టిత్రవ్వి మనదేశ ప్రజిలకై- మణులనెత్తువారు
పొట్టకూటికే కష్టములంబడి- పొగులుచుండువారు
కమ్మనితిండికి చక్కనిబట్టకు- కఱవునఁబడిపోయి
ఎమ్మెయిఁజూచిన లోకయాత్రిలో- ఎఱుఁగరింతహాయి
బడబాగ్నినిదన పొట్టఁబెట్టుకొని- పాలుపరులకిచ్చు
పుడమికిఁగూర్చుచు పైరుపచ్చనగ- మురియుచు మదిమెచ్చు
వంచెనచేసెడి పిట్టలఁగొట్టఁగ- వడిసెలచేఁబూను
మంచెయనెడి సింహాసనమెక్కను- మహినేలగఁదాను
కొంపకువచ్చిన ఇతరుఁడెవ్వడును- కుడువకుండఁబోఁడు
ఇంపగుమాటలఁ దృప్తిపఱుపఁగా- నెంతయుఁదగువాఁడు.

వ॥ ఇటుచూచితిరా. వీరందఱు వస్త్రకారకులు.

— రగడ —

అలుబిడ్డలును దరిద్రమునఁబడి- అఱఁగిపోవుచుండ
కూలిచేసినను జాలకఱ్ఱదుకులు- కుమిలిపోవుచుండ
కాలధర్మ రథచక్రముక్రిందున- కాయమునువియ్యెన

ఏలయిట్టితను వెంతపాపినని- ఎంచఁడు మదిలోన
జిలుగు వస్త్రములు తయారుచేసెడి- సిద్ధహస్తులిట్లు
వెలుఁగు నీడలలవేగుచుందురివి- బీదలుపడుపాట్లు.

వ॥ ఇంకా నిటుచూడుఁడు 

— రగడ — 

రస్తాలన్నియు బాగుచేసి మను- ప్రజలువీరు ప్రభువ
నిస్తులకష్టము చేసెడిజీవులు- నింపుముదయ నీవ
బాడిగబండులు తోలెడివారల- బజారులివి దేవ
మేడలు మిద్దెలులేవు వీరలకు- మేలుగూర్చలేవ
ముఱికిపేటలను జక్క సేయుటది- ముఖ్యమంతు దేవ
నిఱుపేదలపై దయచూపుటయే- నీకుఁదగినసేవ
అలమందలను మరల్చువాఁడే- అర్జునుండు సామీ
పాలితులగు మనప్రజల పద్ధతుల- బాగుసేయవేమీ.

వ॥ అని పల్కుచుండ. 

— రగడ —

కొత్తకుండయును నిప్పుపట్టుకొని- కొందఱు ముందుండ
చిత్తము తత్తరమంద నేడ్చెను- జిక్కికొందఱుంత
వాహకులేపియె మోసికొనుచునిటు- వచ్చుచున్నవారు
బాహుళ్యంబుగ జనులువెంబడిని- బయలుదేఱినారు

వ॥ ఆ విషయమునుగూర్చి చెప్పుమనియడుగ చెన్నుఁడు "శవమును శ్మశానమునకుఁ దీసికొనిపోవుచున్నారు. చచ్చినవాని బంధువులు ఏడ్చుచున్నా" రన సిద్ధార్థుఁడు విచారపడి "సారథీ! అందఱు చావవలసినవారే గదా" యని ప్రశ్నించె. అపుడు చెన్నుఁడు

— రగడ —

చావుపుట్టువులు సర్వజనులకును- సహజమ్ములు కావా
ధీవర! ఏరికినిగుఱ పొందెనవు- తెలిసిమూర్ఖఁగలవ.

వ॥ అనుచుండఁగ రాకుమారుఁడు శ్మశానమునగ్గరకువెళ్ళి విచారముతో నిలిచియుండ, ఒక సన్యాసి.

చ॥ జగమొక బొమ్మలాట రవిచంద్రులు దివ్వెలు పాత్రధారులీ
యగణిత జీవులెల్లపరమాత్మ నిరంకుశ సూత్రధారియై
తగినటుత్రిప్పు మాయతెరదాగుచు పాడును సత్యగీత మీ
యగవనవార్థి పట్టణము లాతనిరంగ కథార్థదృశ్యముల్.

వ॥ అనిపాడుచు అదృశ్యుఁడయ్యె దాని భావమును ఆలోచించు చున్న యువరాజును బలిమాలి చెన్నుఁడు ఇటిదారి పట్టించె ఆ రాత్రి.

## —: వైరాగ్యము :—

పటుతరపాపము- వ్యాపించినదన ...... తందానా
కటికి చీకఁటులు- క్రమ్మెను జగమున
ఎత్తగుపందిరి- ఏర్పడినట్లుగ
ముత్తెపుగుత్తులు -పొదివినట్లుగ
అద్భుతరేయిని- ఆకసంబున
నిద్దపుఁజుక్కలు- నిండియుండెను ...... తందాన.

వ॥ అప్పుడు సిద్ధార్థుఁడు కలవరించుచుండె. ఆకలలో—

శా॥ లేరామానవసంఘ సంస్కరణకై లీలావిలాసమ్ముగా
పోరా ఘోరగుహా విహారరతి- సద్బుద్ధిన్ తపస్సిద్ధిచే
రారాబుద్ధుఁడవైత్వదీయ మహిమన్- రక్షింపరాలోకమున్
నీరాకంగని భారతావనిమణీ నీరాజనం బిచ్చురా

వ॥ అను ప్రబోధగీతము వినఁబడె.

## — రగడ —

ఈశ్వరాజ్ఞచే నాతఁడు మేల్కొనె ఈజగమును బ్రోవ
శాశ్వతసౌఖ్యము సర్వప్రజలకును- సాధించెడి త్రోవ
బిడ్డతోడ నిదురించుచున్న తన- ప్రియురాలినిఁజూచె
గడ్డునమస్యలు కొన్నిడెందమున- గాఢముగాఁదోఁచె
సముద్రమథనము జరుగుచున్నదా- సత్పురుషుని మదిలో
అమలామృత మెపుడవతరించునో- ఆమహాత్మునెదలో

వ॥ అత్తఱి యశోధర ముఖమెట్లున్నదనఁగా

— రగడ —

జిలుగుమబ్బులో వెలిగెడిచంద్రుని- శ్రీకాంతికినఖము
వలిపపు మేలి ముసుంగున వెలిగెడి- వారిజాక్షి ముఖము

వ॥ అట్టి మోముఁజూచుచు.

చల్లఁగదిగెను- శయ్యనుండితా .... తందాన....
మెల్లఁగరాహులు- మేనుగాంచెను
జిల్లనహృదయము- జలదరించెను
కల్లోలంబున- కలఁకబారెను
భార్యాపుత్రుల- వదలఁదలఁచెను
కార్యభారమున- కదలినిలిచెను
ప్రేమబంధమును- ద్రెంచివైచెను
కామిని మోమును- గాంచివక్కగా
ఇల్లువిడిచినే- నేగుచుంటిని
ఇల్లాలినినిపు- టిట్లుసేయఁగా
పల్లవపాణిరో- పాపముసుమ్మీ
ఎల్లరశ్రేయము- ఎంచితినమ్మీ
నీప్రవర్తనమె- నీకురక్షణము
నీప్రభావమె- నీకుకవచము
వీరమాతవై- విలసిల్లుదువు
ధీరనారివై- తేజరిల్లుదువు
ఈపసిబిడ్డను- ఎట్లుచూతువో
తాపసవర్యుల- దాపునకేగెద
ధర్మసూత్రముల- స్థాపించుటకు
కర్మబంధముల- ఖండించెదనే
పామునోటితోఁ- బడినకప్పయును
ఏమెయిఁజిక్కిన- ఈఁగయుంచును
నోరుచాపిమృతి- నోటఁజిక్కెను
ఏరికిసౌఖ్యము- ఎట్లుదక్కునో
ఈజన్మంబిట- కెట్లువచ్చునో

ఈ జన్మాంతము- ఎవ్వడుగల్గునే
ఎక్కడి మేడలు- ఎక్కడి మిద్దెలు
ఎక్కడి తల్లులు- ఎక్కడి తండ్రులు
ఎక్కడి భార్యలు- ఎక్కడి బంధువు
ఎక్కడి పుత్రులు- ఎక్కడి మిత్రులు
వెలుగుజాడలో- వెలసిన సత్యము
వెలిబుచ్చగనే- వెడలెద అడవికి
హరిహరులడ్డం- బైననుగాని
తిరుగదు నామది- ధీరత మాని

వ॥ అని తనలో దాననుకొని

స్థిరపడి మెట్లను- దిగుచునుండెను
తిరిగి చూచుచును- దిగ్భ్రమ చెందెను
ఉయ్యేలలూగెను- ఊహలన్నియును
చయ్యన ముందుకు- సాగెను పాదము
అంతట నడచెను- హయముల శాలకు
చెంత నిద్రలో- చెన్నుడుండెను

వ॥ అపుడు చెన్నుని నిద్రలేపగా అతడు లేచి యువరాజా! ఈ సమయమేల ఎక్కడికి పోవలెను. అనియడుగ బ్రహ్మణ్యములకని సిద్ధార్థుడనెందులకని యతడు ప్రశ్నింప సన్యసించి సత్యజ్ఞానమంది విశ్వశాంతి చేకూర్చుటకని రాజకుమారుడు పల్కగ దండ్రి గారి యాజ్ఞయున్నదాయని వాడడుగ నతడు లేదనలేనిచో మనము బయటికి పోరాదని శాసించెనుగదా, కావున

— రగడ —

చండశాసనుడు రాజుమాటనే- జవదాటుటయెట్లు
కండకొ్రివ్యనను దాటిపోయుదక- గలుగవె యుగచాట్లు
ముందునూయి నావెనుక గోయియెటు- పోవ కాళ్ళురావు
మందభాగ్యునను రక్షింపగనా- మాటవినుము నీవు
అంతఃపురమున కాంతలెల్లకను- ఉల్లాడుదురయ్యా
చింతతోడ నీతల్లిదండ్రులిక- చిక్కిపోదురయ్యా

విశ్వాసముగల చెన్నుడొక్కఁడే. వెలయునీకుఁదోడు
అశ్వరాజమా! వదలుచుంటినా. ఆశవీడునేఁడు

వ॥ అని అతఁడుపలుక ఉత్తమాశ్వముగాన ఆమాటలలోని భావము గ్రహించి.

— రగడ —

తలమువంచినది, నాల్కసాచినది. ధైర్యమువీడినది
జలజల కన్నులనీరుగార్చినది. జాలిఁగూర్చినది.
వీడఁజాలనన్నితెల్పెడురీతిగ. వింతగఁజూచినది
వేడుకొంటినన మెడనాతనిదెస. వేగముచాచినది
కొయ్యబొమ్మవలెనిల్చె చెన్నుఁడు. గోడుచెందుచుఁడె
అయ్యానేనిపుడెట్లు పోదునని. అలమటించుచుండె
కాళ్ళవ్రేళ్ళఁబడి మ్రొక్కుచుంటినను. కరుణింపుము దేవ
వెళ్ళిపోవుటకు కాళ్ళురాకనిను. వేడుదు సద్భావ
అడవులలోఁబడి యెటకోపోయెద. అజ్ఞనిమ్ము నాకు
ఒడయుని మొగమే నెట్లు చూచెదను. ఒప్పుదిద్దినీకు

—: వియోగవ్యధ :—

వ॥ అనిప్రార్థించినను వినమింజెన్నుఁడు తిన్నగ గుఱ్ఱమునుమరలించుకొని యింటికివచ్చెను. అంతఃపురమున యశోధర మేల్కాంచి భర్తంగానక చెలికత్తెలచే వెదకించుచుండ గౌతమీవృద్ధరాజులకుఁదెలిసి గుండెలు బాదుకొనుచు ఆమెదగ్గఱకు రా ఆయమ మగని పాన్పుపైఁదలవాల్చి కన్నీరుమున్నీరుగఁబాఱ

ఉ॥ పుట్టితి రాజవంశమునఁ బుణ్యవరేణ్యుని శాక్యసింహుఁజే
పట్టితి ముద్దులొల్కునొక పట్టినిగాంచితి జీవయాత్ర యిం
కిట్టుల సాగిపోవునని యెంచఁగటా! విధికెంతగాఁగనుల్
గుట్టెనో ప్రేమవల్లి తెగఁగోసెను చిట్టెపుజాతి గుండెతో.

వ॥ కరుణావతీ! ప్రాణపతీ! నీప్రియురాలి గతియేమిచేసితివి?

ఉ॥ ఏసునుదాన నెట్టులిఁకనే మనుదాన వియోగవహ్నిచే
నామది గాల్పఁగాఁదగునె నాథ! అనాథనుజేయపాడియే
రామలునన్నుఁజూచి యభిరామనుగాఁ దలపోయుచుండ ఆ
లేమలలోన నాబ్రతుకులేవడి పాలొనరించి తక్కటా.

వ॥ అని దుఃఖించుచు పాన్పుపైఁబడె. గౌతమిహా! కొడుకాయని మూర్ఛిల్లె శుద్ధోదనుఁడు కన్నీరుగార్చుచు -

చ॥ నినుగని పెంచినట్టి జననీజనకుల్ కృశియించిపోవఁగా
నినుభగవంతుఁగాఁ గొలుచు నీసతి గుండె జ్రీకూలిపోవఁగా
నినుదమ రాజుగాఁ దలఁచు నీప్రజలెల్లరు చింతనొందఁగా
తనయ! విరాగివై చనుట ధర్మమ? ఇయ్యది పుణ్యకర్మమా.

చ॥ చివిమినఁ బాలుగా నినును జెక్కుల పాటలకాంతి నుంతయుం
జెవరఁగలేదు, దంపతుల సిగ్గొకయింతయుఁ దగ్గలేదు, దు
ర్మదరిపు జిత్వరీభాకలితరాజ్యరమామణిఁ గూడలేదు, నీ
హృదయము కఱ్ఱరాయిచేసికొని యోగివై జగముద్ధరింపఁగా.

వ॥ అని శోకించుచుండ ముఖ్యబంధువులోదార్చుచుండిరి. ఇంతలో గుఱ్ఱముతో చెన్నుఁడు రా ముసలిరాజు దుఃఖము క్రోధముగ మాఱ పటపట పండ్లుకొఱుకుచు చూచి యోరీ చెన్నా!

— రగడ —

తిన్నయింటివాసాల నెన్నెదవు- తెలిసెను నీచలము
ఎన్నిజన్మములఁ దీఱిపోఁగల- దింతపాపఫలము
అర్ధరాత్రమున యువరాజును నీ- వడవిపాలుచేసి
వ్యర్థపుఁజూపులతోడ డాసితివి- ప్రాణభయము వాసి
కత్తినెత్తి నీకుత్తుక నిప్పుడె- ఖండించెదఁ జూడు
ఇత్తఱి నీతల కోటకొమ్మపై- కెత్తి కాల్తునేఁడు.

వ॥ అని.

కన్నుల మంటలు రేఁగఁగా ...... సై
చెన్నుని ముక్కలుసేయఁగా
గాలిని పెల్లుగఁ బీల్చెను
కాలు నిరూపము దాల్చెను
కసితో మీసము దువ్వెను
ముసలి సింగమన దూఁకెను
ఒఱలో కత్తిని లాగెను
కరకరి చూపున నూఁగెను
చెన్నుడు శిరమును వంచెను
కన్నుల శాంతము నించెను

మంత్రి రాజును జూచెను
చింతం జేతులు సాచుచు
వంతము వలదని యంపెను
వింత ఘట్టమును జూపెను,

వ॥ అప్పుడు చెన్నుఁడు నమస్కారము చేసి-

— రగడ —

కన్నతండ్రివలె నింతకాలమును- గాచినాయుమీర
చెన్నుని కనమిదె లాలింపుండిక- చెచ్చెరకనిదీల
మహాత్ముఁడగు మనసిద్ధార్థునినే- మఱచియుండఁగలన
ఆహారాత్రములు ఈపాపంబున- అడలుచుండఁగలన
నాచేతులలో పెరిగినబిడ్డను- నటడవులవిడ
ఈచేతంబెటు సమ్మతించెనో- ఏనెఱుఁగను తండ్ర.

వ॥ అని మంత్రి జరిగినదంతయుఁ జెప్పఁగ సారథి పూసగుచ్చినట్లు చెప్పి సిద్ధార్థుని వస్త్రములను, భూషణములను, శిరోజములను అచ్చటనుంచి యో మహారాజా! యువరాజుగారు

రాగం- మధ్యమావతి- త్రిశ్రజాతి త్రిపుటతాళము

నన్ను తొందరపెట్టెను- గుఱ్ఱమునుదెమ్మని- నన్ను తొందర పెట్టెను ॥నన్ను॥

నన్ను తొందరపెట్టి యాతఁడు- నాతిని విడనాడఁగోరుచు
నన్నుయింతననెను భూమివల్లభునితోఁ జెప్పఁదగునన ॥నన్ను॥
నిన్నునడవికిఁ జేర్చినంతన- నన్ను నరవరుఁడూరకుండున
విన్నవారలుగూడ నన్నిఁక- నెన్నిఁగా నిందింతురనఁగా ॥నన్ను॥
అంపుమయనను నీవు నాపయిఁ- గోపగింపక నిల్వుమిటనన
పాపపంకమునందు నిలువను- బాయుదును భోగములననుచు ॥నన్ను॥

తల్లిదండ్రులు నీదుభార్యయుఁ- దగనిదుఃఖములందుచుండఁగ
ఇల్లువెడలుట చెల్లదీవన- నింతయును మదిమార్చుకొనకే ॥నన్ను॥
మీకు నపకృతునే నొనర్తున- మీరలేగద సౌఖ్యదాతలు
మాకు నమ్ముఁడు నిజము సుబ్రహ్మణ్యవరదుని సాక్షిగావిను ॥నన్ను॥

వ॥ దేవా! ఆపుణ్యపురుషోత్తముని వీడ్కొని వచ్చుచున్నప్పుడు కన్నీళ్లతో వారి పాదములం కడిగి పాదుకలు నాకు ప్రసాదింపుడని వేడ ప్రేమతో నొసంగె. ఆకరుణాలవాలుండు తిరిగివచ్చువఱకు నేను వీనిం బూజించుకొనుచుండెద.

చ॥ ఎవని విరాగకేళిలలకు- ఈపురలక్ష్మి తపించుచున్నదో
ఎవని పరోపకారమున- ఈజగమెల్ల సుఖింపనున్నదో
ప్రవిమలుండైన యాసుగతు- పావనపాదములుంచినట్టి యీ
శివకరదివ్య పాదుకలు- శిరముపై నిడుకొందు భక్తితో.

వ॥ అని చెన్నుండు సెలవుతీసికొని యశోధరాదేవిని సమీపించి

— రగడ —

అమ్మా చెన్నుని నమస్కారముల- నందుకొనుముతల్లీ
ఇమ్మెయి పలిపిన దుర్మార్గుండని- ఎంచకుగుణవల్లీ
కమ్మని నోరను చేదుమేయంగా- కాలముచనుదెంచె
అమ్మరో అశ్వమునాతోంబాటుగ- అడలుచునేతెంచె.

వ॥ అనుచుండ యశోధర కన్నీరుగార్చుచు,

రాగము- ఆనందభైరవి- త్రిశ్రజాతి త్రిపుటతాళము

ఎంతకీడొనరించితయ్యా- ఈనిసేవకులకునిద్దిచెటుగదయ్యా ॥ఎం॥
ఇంతచేసితీవు- ఇనుండుగాదెవండైన
శిక్షసేయకనిన్నుం- వీక్షింపంగలంగా ॥ఎం॥
సారథి వినవయ్యానిన్ను- సతము భూపుని సౌఖ్యమే
మదింగోరినేండు- చింతగలుగంజేసితేల
జ్ఞానశూన్యతచేత- వారిగానంగలేక
నవసిదైవము వేండ- ననుగావలేంద ॥ఎం॥

వ॥ అనియశ్వమునుజూచి-

— కథ —

భార్యాభర్తల వేఱుసేయ నీ- ప్రాణమెటుల ఒప్పె
అర్యపుత్రుని సిట్లవనులవిడుచుట- అశ్వమనీ తప్పె
ఎంత యేడ్చినను నానునోహరుని- ఎవరు తేగలారు

ఇంత సేతకయి పెంచితి మానినా- ఏమి నీదు తీరు
అత్తమామల నిద్రలేపుటకు- ఆ అవజాలనైతి
ఇంత ఆసించితగ చింతపొందుటిది- ఎవరు మెచ్చు నీతి

వ॥ అనుచు చెన్ననిగని

— కథ —

కంచెయె చేనిమేసినఁదలఁచినచో- కాపేమొనరించు
మంచియెల్ల ఈరీతిగ మారిన- మాకేమనిపించు
వాకేమైనను సందేశంబును- నాథుఁడంపినాఁడ
వాకొనఁదగు శుభవాక్యము లున్నను- పలుకుము నాతోడ.

వ॥ అన సారథి నమస్కరించి

— కథ —

అమ్మాయేమని తెలుపువాఁడనే- నా మహాత్ముపలుకు
మమ్మరమగు తనదీక్షను దెలిపెడి- పులకండపుఁబలుకు
శ్రద్ధతోడనే తపముచేసి పర- సౌఖ్యసుధను దెత్తు
బుద్ధుఁడనైనే తిరిగివచ్చితిన- మోక్షామృత మిత్తు

: సిద్ధార్థుఁడు బుద్ధుఁడగుట :

వ॥ అనని సెలవుతీసికొని యాతఁడు వెడలిపోయెను. అక్కడ సిద్ధార్థుఁడు వేలారణ్యమునఁ బ్రవేశించి మహర్షులవలన బ్రహ్మోపదేశమును బొంది యొక రావిచెట్టుక్రిందఁ గూర్చుండి తపస్సు ప్రారంభించెను. సంవత్సరములు గడచిపోవుచుండెను. మన్మథుఁడు తన బాణములను బ్రయోగించి మరల యశోధరపై మనసు గలిగింపయత్నించి విఫలమనోరథుఁడయ్యె. అప్పు డాకాశవాణి.

ఉ॥ ఎవ్వని పూపుటమ్ములకు- ఈశుఁడు సైతమొకింత లొంగెనో
అవ్విలుకాఁడు మన్మథుఁడు- హుంకృతితో విరజిమ్మినట్టి ఆ
పువ్వుల బాణపంచకము- పూర్ణముగా వృథయయ్యె దేవతల్
పువ్వులు చల్లుచుండిరిఁక బుద్ధుఁడవైతివి లెమ్ము తాపసీ!

వ॥ అని పలుక నమ్మహాత్ముఁడు దివ్యజ్ఞాన సమేతుఁడై బ్రహ్మానందమునఁ గనులు తెరచియు శుష్కించియున్న కారణమున నా చెట్టు క్రింద పరుండె. ఇంతలో రాముఁడను మందకాఁపరి ... టిక్ ...

...హై ...ఇస్స్ ... కూ ... ఏంమందరా నీమందజావ నడ
వనే నడవదేంరా ఈకుంటిగొఱ్ఱెపిల్ల యేం అడ్డాలు తిరుగుతుంది
రా. కానీ సరిగ్గాపుంటేనా పట్టసిక్కంగాదురా. అదెక్కబోను
ఇదెక్కబోను. ఆ పొదలోదూఱి. ఈపొదలోదూఱి. పాదరసం
లాంగా పారకాడద్దే మామంద కుక్కమాంచి తెలివికల్దికాబట్టి
పిల్లబీగుపోకుండా వాల్లెను కొత్తుంది. ఏలినోరిబీళ్ళు కావలసినన్ని
వున్నాయి. కమ్మగా మేపుతున్నా. ఈమేక బుద్ధి యేంబుద్ధోగాని
మోసుదాగిగిన మొక్కగనపడ్డదా తల గొఱకటమే ... టిక్..
...ఇస్స్... ఎండేళగదూ, ఈ రాగిచెట్టునీడ ఇఱ్ఱిపిల్లల్లాగా నిల
బడ్డాయి నానుగూడ రవ్వంతసేపు నిలబడతా." అని నిలిచి

— గేయము —

సిక్కవేమిరా కిష్టా సిక్కవేమిరా ॥పల్ల॥
ఎన్నముద్దల దొంగా ఏడవనిను రారా
రేపల్లెవాడలోన ఎలసిన చిన్నికిష్టా ॥సిక్క॥
గోవర్ధనగిరియెత్తి గొల్లలను కాపాడి
కాళింగుతలయెక్కి ఘల్లుఘల్లన ఆడినావు ॥సిక్క॥
సీరలన్ని సంకబెట్టి చెట్టునెక్కికూచోని
గోపికలను కొంతసేపు గుసగుస లాడించినావు ॥సిక్క॥

వ॥ అని పాడుకొనుచు బుద్ధునిజూచి ఆహారములేక చిక్కిపోయినాం
డని గ్రహించి మేకపాలు ఆయననోటిలో పిండెను. అవి త్రాగి
లేచికూర్చుండి యమ్మహాత్ముడాం రావి చెట్టునకు బోధివృక్ష
మని పేరిడె. ఇంతలో సేనానిఅనెడి పల్లెలోని యాదవ శ్రేష్ఠుని
యిల్లాలు— ఆ చెట్టును సమీపించె.

— రగడ —

రావిచెట్టునకుం బ్రదక్షిణములా— రమణిచేసినంత
శ్రీవిభుకృపచే గర్భముదాల్చెను— చెన్నుగ నకాంత
పెద్దల దీవనలొప్ప సుజాతకు— పెన్నిధియితండనంగ
ముద్దులకొడుకుదయించినాండు తన— మొక్కుదీర్చ కోవంగ

పండుపంటి ముత్తయిదువ తనతో- పయనంబయిరాగా
పండులు పాయసమాకులువక్కలు- పాలును గొంతేగా
మూండుమానముల మగబిడ్డనితో- ముదమునసే తెచ్చె
వేండుకొన్న భగవంతుండెయితండని- వేడ్కతోడఁగాంచె
తెచ్చినవన్నియు బుద్ధుని ముందఱ- డంపచక్కఁగనియె
అచ్చపుఁ బ్రీతిగ మ్రొక్కుబడిని నీ- వారగింపుమనియె.
వ॥ అంతట బుద్ధుఁ డేమనుచున్నాఁడన.

— రగడ —

నేనును నీవలె మానవమాత్రుండ- నిజము నమ్ము తల్లీ
దేనికిదెచ్చితి విన్ని వస్తువులు- దెలుపుము గుణవల్లీ!
వ॥ అనిమదుగ అయమ్మ జరిగిన దంతయు చెప్ప.

— రగడ —

నీవిశ్వాసమె నీకుదైవమై- నిన్నుఁ బ్రోచెనమ్మ
పావనమగు మనభారతదేశపు- భాగ్యంబిది కొమ్మ.
పరమప్రతివ్రత! నీసంతానము- భాగ్యవంతమగును
వరుఁడు దేవుఁడని పూజలుసేయఁగ- వనితనీక తగును
అనుచు కొన్నింటిని ఆరగించెను- ఆనందముతోడ
తినుఁడని ఒక మెతుకు రామునకిచ్చెను- దీవనలను గూడ
వ॥ అంతఆయమ్మ ప్రదక్షిణముచేసి నమస్కరించివెళ్ళెను. బుద్ధుఁడు రామునిజూచి ఈ మంద నెక్కడికి తోలుకొని పోవుచున్నాఁడవని యడిగెను. అందులకు గొల్లవాడు,

## —: బిందుసారుని యజ్ఞము :—

— రగడ —

బిందుసారుఁడొకయజ్ఞముసేయుచు- పిలువనంపినాఁడు
సంబరముగఁ గడుమంచి మేఁకలను- చంపఁదలఁచినాడు
ప్రభువుల ఆజ్ఞకు బద్ధుఁడనైనే- బయలు దేఱినాఁడ
శుభముగనేఁ జనికోరిన వెల్లను- చూచియిచ్చువాఁడ
వ॥ అనిచెప్పినంత అయజ్ఞమున జరుగుహింసను మాన్పవలయునని

బుద్ధుఁడు గొల్లనితో బయుదేరె. అక్కడ మగధరాజు బింబ సారుఁడు జన్నము ప్రారంభింప-

— రగడ —

అజములతోడను రాముఁడు మెల్లఁగ- యజ్ఞశాలఁజేరె
సుజనులు మేఁకకుఁబొట్లు పెట్టెంట- శోభలు మితిమీతె
పసుపుఁ గుంకుముల నలంకరించిరి- పావనయూపమును
కుసుమాక్షతలం బూజించిరి శ్రుతి- గోపురదీపమును
సంభావనలకు వచ్చిరెందఱో- సద్బ్రాహ్మణవరులు
సంభావించిరి రాజుధర్మమును- సజ్జనులగునరులు
అగ్నిహోత్రునకు నృపుఁడు మంత్రమున- ఆజ్యమువర్షించె
భగ్నంబయ్యెను పాపజాలమని- బాగుగ మదినెంచె
సమిధలు దర్భలు పూవులు ఫలములు- సవనసీమనుండె
క్రమముగ ఋత్విజతతి వేదంబుల- గానంబటనిండె
నవరంధ్రమ్ములు పూడ్తుసమేఁకకు- నానామంత్రముల
ప్రవిమల భక్తినిపవదీయుదురిఁక- బహువిధ తంత్రముల
సవన పశువునిదె వధియించెవమను- సన్నాహము కలుగ
శివునివోలెఁ జనుదెంచెను బుద్ధుఁడు- చిత్తమెల్లఁగలఁగ

— గేయము —

వెదకరా నీలోన వెలుఁగొందుజ్యోతి
తుదముట్ట అజ్ఞాన దుఃఖదుర్నీతి
మానరా పరహింస మలినమౌబుద్ధి
రాణించు నీయంతరంగ సంశుద్ధి
మతభేదములతోడ మఱఁగి పోకండి
హితము కాదఁగు ముందుగతులు కానండి
సర్వమానవ సంఘ సౌఖ్య మెంచండి
నిర్వాణ మార్గాన నిలిచి చూడండి.

వ॥ అని పాడుచువచ్చి-

ఉ॥ ఆఁగుము ఋత్విజా! నృపతి యజ్ఞమున ధనకాంక్షఁజేసి యీ
భాగముఁ జంపఁబూనితె విచారములేకిది పాపకృత్యమీ
వీగతి నోరులేని పశుహింసకుఁ బూనుట చూడఁజాలకే
యాగము నాఁపవచ్చితి యథార్థపథమ్మిఁకఁ బాఱఁజూడుమా.

వ॥ అని పలుక యజ్ఞముచేయుచున్న బ్రాహ్మణులకుఁ గోపమురా.

— రగడ —

వేదఋక్కులను ఋషులవాక్కులను- ద్వేషించెడివాఁడా
వాదములేటికిఁ దొలఁగుము మూఢా- వదలును మాపీఠ
రాజాజ్ఞేటికి నూరకుండెదవు- రక్షింపుము క్రతువు
ఏజాతికి నేనిట్టి మాటవిన- ఎట్లుఅగును హితవు
జన్నంబునతయుఁ బాడుసేయుటకుఁ- జనుదెంచినవాఁడు
కర్విన్నవ వీనిని బయటికిఁబంపుము- కావుమిద్దినేఁడు
పాషండుండని తెలియుచున్నది- పాపియుండఁదగఁడు
వేషముచూచిన ఋషిగానుండిన- వెగవీనిఁదెగఁడు

వ॥ అన బుద్ధుఁడు- ఆర్యా.

తే॥ మూఢవిశ్వాసములను నిర్మూనమ్ము
సేయుటది నాస్తికత్వమా సిగ్గుచేటు
రాసిలోఁ దాలిగింజలు తీసివేయ
సేవ్యకానిని నిందపాల్- సేయఁదగున

వ॥ అన శంకరభట్టు నీవుసేవ్యకాఁడవా యని ప్రశ్నింప నాసనుచు

మ॥ హలమాధర్మము- క్షేత్రమా మనసు- సద్వాక్యాలసత్కర్మము
కలుపుందీసెడియాయుధాలు- గుణసంఖ్యల్ బీజసందోహముల్
జలమాబోధ- అమోఘసేవ్యమెప్పుడుఁ సాగించి నిర్వాణమన్
ఫలముంగూర్చెడి రైతురాజునని సంభావింపుమో ఋత్విజా!

వ॥ అన- రాజు

— రగడ —

అయ్యాయేటికి ఇట్టులాడెదవు- అరుగుము నీదారి
చయ్యనయజ్ఞము పూర్తిచేయువలె- చనుమిఁక జడదారి

వ॥ అన విని—

— రగడ —

ఏలయాగమును జేయుచుంటిరిది- యెఱిఁగింపుము నాకు
వేలకొలఁది పశుహింసలు జరుగుట- వేడుకయా మీకు.

వ॥ అన రాజు పాపపరిహారమునకు- దేశారిష్టములు తొలఁగుటకు-
అగ్ని, ఇంద్రుఁడు, సోముఁడు మొదలగు దేవతలు తృప్తినొందుటకు-

అనిపలుకి ఈ సాధుజంతువులు జంపిన దేవతలు సంతోషింతురా ఆరగింతురా? ఆదరింతురా?

చ॥ ఎఱుఁగదు జీవహింస- పరులెవ్వరు కొట్టినఁ గంటనిప్పుకల్
చెరుగదు- పచ్చిగడ్డితిని చిక్కనిపాలనొసంగు- చచ్చియుం
దొఱఁగదు మేలుసేఁత- ఒకదోసమెఱుంగని సాధుజంతు వి
ట్లవఁగ గొంతుగోయఁదగునా? నరజాతికి నీతియున్నదా?

వ॥ అని సర్వార్థసిద్ధుఁడనుగ బుష్యాజుని కన్నులు అగ్నికుండములై వెలుఁగ-

చాలుర చాలిఁకఁ దొలఁగుము ... ... సై
మేలగు రీతిగ మెలఁగుము
నాస్తిక బుద్ధిని వీడుము
శాస్త్రి చేసెదము చూడుము
బలిపీఠంబును బాయుము
బలి యర్పించుట న్యాయము
యజ్ఞము పాడొనరించెదే
యజ్ఞను జూపుచు మించెదే
కర్తకు నీవిధి హానిరా
వర్తనమియ్యది మానరా

వ॥ రాజా——

— ద్విపద —

హైందవాచారాల- నణఁచివేయంగ
సందేహపడకిట్లు- సాగినాఁడితఁడు
ఈ దుష్ప్రచారంబు- లీరీతిఁజేయ
ఈదేశధర్మంబు- లిఁకమాఱునయ్యా

వ॥ అన బుద్ధుఁడు శాంతముతో ——

— రగడ —

సర్వజీవులును దేవునిబిడ్డలు— శాంతముతోఁజూడ
గర్వము మీఱఁగఁజిన్నజంతువుల- ఖండింపకు ఱేఁడ
చంపెడి వారలఁజూచివెచ్చఁడు- సర్వేశుండెప్పుడు
నింపుము నీదయనిండు హృదిమెరద- నేర్పుమీఱనిపుడు

ఎవఁడైనను నిమఁజంపవచ్చివపు- డెట్టుబుండునీకు
భువిపైఁ బ్రాణుల కట్టులుండునను- బుద్ధి విడువఁబోకు
కావున జీవులఁగరుణంజూడుము- కలదు మోక్షఫలము
పావన సత్యక్షేత్రమ్మునకది- బంగారపు హలము
అని సిద్ధార్థుఁడు పల్కినంతనే- అధిపుమనసు మారె
సునిశితమగు నవధర్మసూత్రమెద- సున్నితముగ దూరె
వెంటనే బుద్ధునిపాదపద్మములు- వేడుకతోఁగనుచు
గెంటుము మాయజ్ఞానమ్మునిపతి- కేలుమొగిచి వినుచు
ఏవంశమ్ము పవిత్రమొనర్పఁగ- నిట్లు పుట్టినారు
పావనులౌ తలిదండ్రులెవ్వరో- పలుకఁదగునుమీరు
అని రాజడుగఁగ బుద్ధుఁడెంతయును- ఆనందముతోఁప
ఘనుఁడగు శాక్యనృపాలుని పుత్రుఁడ- గానెఱుఁగుముభూప
అనఁగనె సిద్ధార్థుండవునీవ- అతిమోదముదేవ
జననీ జనకులు వెదకించిరినిను- దయ్యనఁజనలేవ
చిన్నతనమ్మున సన్యాసమ్మను- స్వీకరించితేల
అన్నులమిన్నను అర్ధాంగిని విడి- అడవికిఁ జనమేల
ఇచ్చెదరాజ్యము కన్యామణితో- ఏలుకొమ్ముదేవా
చెచ్చెర నీదరిఁజేరి యెప్పుడును- జేసెదనీసేవ

వ॥ అన-

ఉ॥ వీడితి రాజ్యభోగరతి- వీడితినత్సతి- తల్లిదండ్రులన్
వీడితి- బంధుమిత్రతతి వీడితి- కక్కునకూటి కాసయా
కూడదు- దేశదేశములకుంజని ధర్మముబోధసేయుచున్
బాడిదొఱంగియున్న ప్రజ బాగొనరింపఁ దలంతుభూధవా

వ॥ మీ వంటివారు నాయుద్యమమునకుఁ దోడ్పడిన సరగున సత్యాహింసలు సుప్రతిష్ఠములు కాఁగలవన రాజిట్లను-

చ॥ తెలియక తూలనాడితి సుధీవర! నీవచనామృతమ్ముచే
మొలకజనించె నాహృదయ మోక్షరసాంచిత భావబీజ సం
కలితమహాలవాలమునఁ గావుము నన్నొక శిష్యరీతిగా
సలుపను జీవహింసగల జన్నములేనిఁక దైవసాక్షిగా.

## బుద్ధుఁడు - బింబిసారుఁడు - సంవాదము

మాయామాళవ గౌళరాగము - దరువు ఆటతాళము

చెప్పుమా - శాక్యకులాబ్ధిసోమా - చెప్పుమా॥
సర్వలోకమునిండి విశ్వంబెల్లనడుపుచుఁ దాన శాశ్వత
దివ్యతేజముతోడ వెల్గంగల్గునాత్మ జ్ఞానగరిమ ॥చెప్పు॥

బుద్ధుఁడు -

ఎఱుఁగుమా - సత్యము సార్వభౌమా - ఎఱుఁగుమా॥
తనదులోపల తెలివితానఁయితత్త్వమును దర్శించియోగము
మనసునిలిపిన మహిమ పెంచినయెఱుక బ్రహ్మంబంచుమదిలో ॥నెఱుఁగు॥

బింబి -

ఎక్కడెక్కడి ప్రాణికోటులు - పెక్కు లెట్టులవచ్చె ధరకిం
కెక్కడీగతినుండి కడకే - దిక్కునకువిడిపోవనగునో ॥చెప్పుమా॥

బుద్ధుఁడు -

అద్దములలో నీడలంబలె - అఖిలజలముల భానుబింబము
ప్రతిఫలించిన రీతిగానిల - జీవసంతతివచ్చిపోవుట ॥నెఱుఁగు॥

— రగడ —

అని బోధింపఁగ ఋత్విగ్వర్యుని - ఆత్మమాఱిపోఁగా
వినిపింపుండని యతఁడును వేఁడెను - వేడ్కకడలుకొనఁగా

వ॥ అపుడు శంకరభట్టను పురోహితుఁడు కోపోద్రిక్తుఁడై "ఓరీ! ఋత్విజా! నీ మకరకుండలములు నీ కార్మికపు సాలువులు నీ హస్తముఁ గజ్జలు. తగులఁబెట్టనా? నీవంటి వేదపండితుఁడు లేఁడనుకొంటిని. నీకుఁ గూడ మతిమాలినదా? ఇఁకఁబోయి నా స్త్రీమతముతోఁ నాకు పౌరోహిత్యము లేదని వెడలిపోయెను. ఆ దివస జేరుము రాజాదులకు ధర్మోపదేశముచేసి మఱునాఁడు వారి వెంతయు విడ్కొని పల్లెలఁ బట్టణముల దివ్యజ్ఞానమును బోధించుచు శిష్య బృందములో మెఱుంగు వ్యాసమహర్షివలెఁ గడకుఁ గపిలవస్తు పురము సేరె. ఏడుసంవత్సరములవయస్సునందున్న రాహులుఁడు తన జనని వగ్గఱఁ గూర్చుండి

## ॥ బుద్ధుని పురాగమనము ॥

— రగడ —

కడుపునకన్నము కంటికి నిద్రయుం- గఱవుగ మనుచుండ
ఎడారినవిధవలె యశోధరాసతి- ఎండిపోవుచుండ
కన్నతల్లి నీవేల దిగులుతోం- గంటనీరు గార్చు
ఎన్ని దినంబులనుండి చూతునిది- ఎట్టులింక నోర్తు
అదియిది గోరిన తాతగారినే- అడుగు ముందువెల
ముదమునం దండ్రిని గోరుమంచునీ- ముదల యీయువేల

చ॥ అడిగితినెన్ని మార్లొ బదులాడవు కారణమేమి యమ్మ! నీ
కొడుకును గానొ- నాకు జనకుంగను భాగ్యములేదొ- తండ్రితోం
దొడవయిం జేర్చుకోందగు మతుండను గానొ- మరేమి? యేటికే
విడుతువు కంటినీరు నినువేండెద సత్యమెఱుంగం జెప్పుమా

వ॥ అని యడుగుచుండ బ్రహ్మవర్చసము ముఖమునం దాండవమాడుచుండం దేజఃపరివేషమున దివ్యమూర్తియై జటాకిరీటకాషాయాంబరధారియై భిక్షాపాత్రిచేం బూని సత్యజ్ఞాన ప్రబోధమొనర్చుచు శౌద్ధోదని వచ్చెనన్న వార్తవిని యప్పట్టణంబు చంద్రోదయంబున నుప్పొంగు పాలసంద్రిమయ్యె. అప్పుడ మంజువాణి యశోధరతో అమ్మా! చక్రవర్తి కాందగిన యువరాజులు పరివ్రాజక చక్రవర్తియై మన పత్తనము ప్రవేశించిరట.

మ॥ మురళీ గానమువిన్న తత్క్షణమునుగోవుల్ గోపికల్ గోపబా
లురు గోవుల్ హరిం జేరి తద్రస సుధాలోలత్వముం జూపుచున్
బరమానందము నొందురీతిం బ్రజసర్వజ్ఞ ప్రబోధామృతా
దరముం జూపుచుం జేరుచుందురట కాంతా! యెంత పుణ్యాత్ముండో

వ॥ అనుచుండ-

— రగడ —

చెన్నుండు బుద్ధుని రాక రాజునకుం- జెప్పెముదముతోడ
గ్రన్నన నంతఃపురమునవెల్లరు- కదలిరతనిం జూడ
అంతట భూపతి దశబలుడాసెను- అనందమునిండ
చింతలం బాపెడి శ్రీహరియితండని- చెప్పుకొనుచునుండ
పితృఋణమ్మును దీర్చువాండవని- ప్రేమించితి మున్ను

మాతృదేశమును నుద్ధరింతువిఁక- మణివఁజాలినిన్ను
పాత్రమెత్తిఁగియిడు నీచేభిక్ష- పాత్రమందుకొనియె
చిత్రమ్మె మో నిన్నుఁజూడగనే- చింతలెల్లఁజనియె

వ॥ అడవిని సర్వజ్ఞుఁడా భిక్షాపాత్ర మహిమఁ జెప్పదలంచి

సీ॥ ఈపాత్రఁ గొనిగదా- ఈశుఁడు ప్రియమార
అన్నపూర్ణను బిచ్చ- మడిగికొనియె
ఈపాత్రఁ గొనిగదా- ఇందిరా సుందరీ
భర్త దానవలోక- భరనడిగె
ఈపాత్రఁ గొనిగదా- యెలమి మైవ్యాసుఁడు
పులిగూడు కాశిలోఁ- బొందఁగలిగె
ఈపాత్రఁ గొనిగదా- యేనాటికిని పటుల్
మాధుకరాన్నన మనుచునుంద్రు

తే॥ అట్టి యీపాత్ర యాత్మ కల్యాణ సూచ
కంబు కావునఁ గామనిష్కామములకుఁ
దారతమ్యము గమనించి- తత్త్వమెంచి
అనఘ! మోక్షామృతమ్ము నీవందుకొనుము.

వ॥ అనఁ గిరీటమునకు మాఱు జటా జూటము- చంద్రహాసమునకు బదులు యోగదండము ధరించి ఛాత్రసమేతుఁడై సనకసనంద నాది దివ్యర్షి పరివృతుండగు దత్తాత్రేయమూర్తివలె వచ్చినాఁడని మెచ్చుకొనుచుండ-

కొడుకుఁ దోడఁ జనుదెంచి యశోధర- కూర్మి విభువిగనియె
కడిగి పాదములు, పువ్వులుంచి తన- కనులకద్దుకొనియె
ఎన్ని కోర్కెలను కొండలెత్తుము- ఎడఁదలోనకరఁగి
సన్నని జలరూపమ్మున వచ్చెనో- సతికన్నుంఁదిరిగి
కాంత యశోధర పతిపాదమ్ముల కన్నీటనుగడిగె
కొంతసేపటికి మనసులోన కల- కోరికలేయుడిగె

వ॥ అంత నిరువురు కొంతసేపు మౌనముద్రవహించి యుండినన్ను రాహులుఁడు ఈయన మా నాయనాయని ప్రశ్నించ నౌను. నాయనాయనే. అందులకబ్బాలుఁడు ఇప్పుడు నాకుముద్దుగా పాలుపోసితివే యన.

— రగడ —

చిరంజీవ యని రాహులు బుద్ధుఁడు- చేరఁదీసికొనియె
నిరపాయమ్ముగ వర్ధిల్లుదువని- నిండుప్రేమ ననియె
శిరమునఁ బావలు చెన్నుమీఱఁగాఁ- జెన్నుఁడు చనఁదెంచె
కరమను రాగముతోడ మహాత్ముఁడు- గాంచుచు దీవించె
అగపడలేదే కంటకమనజినుఁ- డాతఁడందుకొనియె
దిగులుతోడ మరణించెను గుఱ్ఱము- ధీవర వినుమనియె
జంతువులందును నెంతనీతిగల- జంతువిద్ది చెన్నా
ఇంతటదానికి శాశ్వత సుగతిని- ఈశుఁడిచ్చు నన్నా
అనుచునుండఁగా దేవదత్తుఁడును- అచటికిఁ జనుదెంచి
తన యుష్ణీషము బుద్ధుని పదముల- దాపునందు నుంచి
తనశీర్షంబును సుగతుని యడుగులు- తాకునట్లు వంచె
ఘనపాపిని నన్గరుణఁ జూడుమని- కరములు జోడించె
అంగుళిమాలుండనియెడి దొంగయు- అత్తఱినే తెంచి
సంగరహితుఁడగు బుద్ధుని చెంగట- శస్త్రాస్త్రములుంచి
కోరికోరినే చేసినపాపము- కొండవోలెఁ బెరిఁగె
కారుణ్యంబున సుగతిఁ జూపుమని- కాళ్ళమీఁది కొరఁగె
నవయౌవనమునఁ గుబ్రుతళుక్కుతో- నందుఁడటకువచ్చె
సవినయమతియని బుద్ధుండతనికి- జ్ఞానదీక్షయిచ్చె
అందఱనాతఁడు దీవించుచుఁగడు- ఆదరమునఁ జూచె
అందఱకప్పుడు దివ్యభావతతి- ఆత్మలందుఁదోఁచె
నేలయీనినటు మైదానమ్మున- నిండెను జనమెల్ల
పూలదోసిళులు పట్టియుంచిరి- బుద్ధునిపైఁ జల్ల
పొంగులువాఱెడి భక్తితోడజిను- బోధనముల వినుచు
బంగరు బొమ్మలవోలె నిల్చిరి- పరమయోగిఁగనుచు
జీవహింసతోఁ గూడినపనులను- జేయవలదు మీరు
పావనమగు ఈ భారతధర్మము- ప్రపంచమే కోరు
మానవసేవయె స్వర్గ మార్గమను- మాట మఱవవలదు
పూనిదానికై సర్వమొసంగినఁ- బుణ్యమెంతొకలదు

వ॥ మహాశయులారా! లోకతత్త్వమును గ్రహించి యెదురీతకుఁ బ్రారంభించి దుఃఖ కారణములగు వేరుపురుగుల దొలఁగింపఁ దలంచితి. ఏ మతముగాని- పశరిపాలనముగాని, అసత్యమున కుక్కశవచముగ స్వార్థమునకుఁ బెట్టనికోటగ- అన్యాయమున కాలవాలముగఁ- బరరక్తాస్వాదనమునకు జలూకముగ- సాధు హింసకు ఖడ్గముగనుండరాదు. పైరులోఁ గలువుపోలె గుడ్డి నమ్మకము లడ్డులేక పెరిఁగియున్నవి. వానిని నిర్మూలన మొనర్ప వలయు. తొలి బిడ్డను మ్రొక్కుబడియని గంగానదిలోఁ బాఱ వేయుట- భర్తృశవముతో బ్రతికియున్న భార్యను గూడఁగట్టి కాల్చివేయుట, కాళికాదేవికిఁ జక్కని బాలబాలికల బలి యొసంగుట యెంతటి క్రూరకృత్యములో యోచింపుఁడు పరిశీల నములేని జ్ఞానము వెలుఁగులేని యింటివంటిది బరమాత్మను దెలిసికొనఁగోరి యుపవాసాది వ్రతములచే శరీరమును శుష్కిం పఁజేసితిని ఆఱు వత్సరములరణ్యములోఁ దపమాచరించితిని. కాని, అవాఙ్మానస గోచరుండగు పరమేశ్వరునిగూర్చి సర్వజనుల కర్థమగునట్లు చెప్పఁజాలను. ఆత్మసాక్షాత్కారము తత్త్వపరులకే యసాధ్యముగనుండ నిఁకసామాన్య మానవులకెట్లర్థమగును. మాలిన్య రహితమగు నద్దమునందువలె నిష్కల్మష హృదయ మున ఈశ్వరగుణములు చక్కఁగఁ బ్రతిబింబించును. కావున మానవుండు గుణములఁజక్కఁ బెట్టుకొనవలయును. స్వయంకృత కర్మానుసారముగ జీవికి సుఖదుఃఖములు గలుగుచుండును. సుఖమే స్వర్గము. దుఃఖమే నరకము. ఈ ధర్మచక్రమునందు లిఖింపఁబడిన యహింసాది చతుర్వింశతి ధర్మసూత్రములను నిత్యము జ్ఞప్తియందుంచుకొనుఁడు.

— రగడ —

ఈ మార్గంబున నిచ్చలునడచిన- ఈశుఁడు దీవించు
ప్రేమజీవియెడఁ- జూపినదైవమె- ప్రియమునఁ బాలించు
గుణములన్నియును జక్కఁజేసికొన- గురుఁడే తానగును
దినదిన సాధనమున నరుఁడేతా- దివ్యపురుషుఁడగును

సర్వజగంబుల నిండివెలింగెడి- సర్వేశుఁడు మీకు
సర్వసుఖంబుల నిచ్చుచు దయతో- సతతము మిముసాకు.

వ॥ అని ఆశిషములీయ గుణవత్తుఁడు సర్వజ్ఞునకు నమస్కరించి ఆనంద- అశ్వజిత్ - కౌండిన్య- మౌద్గల్యాయన- సారీపుత్రాది ప్రసిద్ధ శిష్య బృందముతో మీరుపన్యాస మొసంగుటచే ధన్యులమైతిమి. సూక్ష్మఫల సంభరితమైన ప్రసముద్రములదాఁటి రేవు చేరిన నావవలె నుపన్యాస వేదిక నలంకరించితిరి. అమృత ధారలొలుకు మీపలుకులు వినుటచే జ్ఞానజ్యోతి ప్రత్యక్షమైనదనఁ జెన్నుండందుకొని భోగమునకంటెఁ ద్యాగము గొప్పదనియెంచి రాజయోగమును ధిక్కరించి యోగరాజమును స్వీకరించి మోక్షద్వారకవాట పాటన మొనరించి దాని దారికిరమ్మని యాహ్వానించి యాదరించుచున్న ఓ అద్వయవాదీ! మీచరణ రాజీవములకి వేనమస్కారములని పౌరులంజూచి మహాజనులారా! ఏమహామహుని యుపన్యాస శబ్దతరంగములు దిక్ప్రపుటంచులకుఁ గొట్టుకొని ప్రతిధ్వనులిచ్చుచున్నవో, అద్యతనభావి నెవని చరిత్ర సువర్ణాక్షరములతో లిఖింపఁ బడనున్నదో అట్టి మహాత్ముఁడు తథాగతుఁడు ఇట ధర్మోపన్యాస మొసంగుట మనయదృష్టము, ఇమ్మహానుభావుని మహిమఁ దెలియ మనమెంతవారము.

సీ॥ అపరంజిరేకుల- నాహరించినవాఁడె
సంకటికొఱకు చేసాపినాఁడు
పసిఁడి జల్తారంచు- వలువ దాల్చినవాఁడె
కాషాయ వస్త్రముల్- గట్టినాఁడు
పువ్వుల పాన్పుపైఁ- బవ్వళించినవాఁడె
బండలమీఁదఁ బన్నుండినాఁడు
ఆరామ సౌధాల- నధివసించినవాఁడె
చిమ్మ చీఁకటిగుహఁ- జేరినాఁడు.
తే॥ ఆమహా కష్టయవనిక- కావలిదెస
నెట్టి సౌఖ్యము దాఁగని పెట్టినాఁడొ

పూర్వవిజ్ఞానమూర్తి ఈబుద్ధుఁడె యుఁగుఁ
గాన యన్యులు తెలియఁగాఁ గలరె జగతి.

— రగడ —

అనుచునుండఁగనె పూవులు చల్లిరి. అచటనున్న జనులు
తన పెన్నిధియే దావైనట్టుల. తలఁచిరచట ఘనులు
హరికిఁ దొమ్మిదవ యవతారంబని_ ఆడిరెల్లరపుడు
తొలఁగును బాపములీ కథవిన్నను. తోష మొదవునెపుడు
ధర్మం శరణం గచ్ఛామియని. ధన్యులాడుచుండ
సంఘం శరణం గచ్ఛామియని. సాధులనుచునుండ
బుద్ధం శరణం గచ్ఛామియని– బుధులు పల్కుచుండ
చెంగటనిల్చిరి నీరాజనములు– చేతులరాజిల్లి
మంగళగీతము లాలపించిరి. మహిళామణులెల్ల
జయము జయము మన భారతమాతకు జయము దిగ్విజయము
జయము జయము మన భరతవీరులకు జయము దిగ్విజయము

గద్యము

ఇది శ్రీమద్గౌరీ శంకర వరప్రసాద లబ్ధ సహజ
చతుర్విధ కవితా కలా విలాస సాహితీరస వికాస
సంస్కృతాంధ్రాది బహుభాషా గభీరమనోహర
భావబంధుర మహోల్లాసభాస బండ్లపిచ్చమ్మాం
పిచ్చయామాత్యాయ పౌత్రి యాదమ్మా
వేంకట సుబ్బయార్య జ్యేష్ఠ పుత్రి
యన్నపూర్ణా సావిత్రీ కళత్రి
సుహృజ్జన విధేయ
సుబ్రహ్మణ్య నామధేయ
ప్రణీతంబైన
బుద్ధ చరిత్ర
సర్వము
సంపూర్ణము.